# గీతాభూమిక

శ్రీ అరవిందఘోషు.



అనువాదకుడు:

గొట్టిపాటి వెంకటసుబ్బయ్య

# గీతాభూమిక

## శ్రీ అరవిందులు

అనువాదకుడు

కొత్తపాటి వెంకటసుబ్బయ్య




శ్రీ అరవిందులు — (జననము ౧౮౭౨ - ఆగష్టు ౧౫)

“ నిత్యానుష్ఠానమందు లేని ధర్మము నిరుపయోగము. ధర్మమార్గమును గ్రహించుట, దానిసత్యమును గ్రహించుట, దాని మహోన్నతభావమనుభవమునకు తెచ్చుకొని నిత్యజీవనమున అనుసంధించుట, ఇదియే కర్మయోగము.

యోగమునే మానవజీవితాదర్శముగ జేయుటకు భారతదేశము వర్ధిల్లుచున్నదని మావిశ్వాసము. యోగమువలననే భారతదేశము తన స్వాతంత్ర్యమును [illegible] పొందుటకు వలయు శక్తిని సముపార్జింపగలదు.”




**శ్రీ అరవిందులు — (జననము ౧౮౭౨ - ఆగస్టు ౧౫)**

"నిత్యానుష్ఠానమందు లేని ధర్మము నిరుపయోగము. ధర్మమార్గమును గ్రహించుట, దానిసత్యమును గ్రహించుట, దాని మహోన్నతభావమనుభవమునకు తెచ్చుకొని నిత్యజీవనమున అనుసంధించుట, ఇదియే కర్మయోగము.

యోగమునే మానవజీవితాదర్శముగ జేయుటకు భారతదేశము వర్ధిల్లుచున్నదని మావిశ్వాసము. యోగమువలననే భారతదేశము తన స్వాతంత్ర్యమును [illegible]క్యమును, [illegible]న్నత్యమును పొందుటకు వలయు శక్తిని సముపార్జింపగలదు."

# అనువాదకుని విజ్ఞప్తి

భగవద్గీత హిందూమతమునకు ముఖ్యమైన గ్రంథ మగుటయేగాక ప్రపంచమంతటను వ్యాప్తిచెందిన విఖ్యాత గ్రంథరాజము. దీనిపై అనేకులు బహువిధముల నానాభాషలలో వ్యాఖ్యాన మొనర్చిరి.

శ్రీ అరవిందులు జగద్విఖ్యాతులు. వారిప్రతిభ సర్వతో ముఖమైనది. వారు భగవద్గీతపైగల ప్రాచీనుల సంకుచిత భావములను ఆధునికుల సంశయ భావములను సహేతుకము గను సప్రమాణముగను ఖండించుచు, గీతాహృదయము విస్పష్టముచేయదలచి యీ "గీతాభూమిక"ను ప్రప్రథమ మున "ధర్మ" యను వంగభాషాపత్రికయందు ప్రకటించిరి.

తదనంతర మిది గ్రంథరూపమున ప్రకటింపబడి యిప్ప టికి ముమ్మారు ముద్రింపబడెను. గీతాపాఠకులకు మిక్కలి సహాయకారిగా నుండు ననెడి యుద్దేశముతో నీ ప్రశస్త గ్రంథము అనువదించి ప్రకటించితిని.

ఇంతియెగాక, శ్రీ అరవిందులచే వ్రాయబడి కృష్ణాపత్రి కలో ప్రకటింపబడిన "గీతలను బఠించువిధము" అను వ్యాస మునుకూడ అనుబంధముగ చేర్చితిని.

ఆ వ్యాసమును ప్రకటించుటకు అనుమతినిచ్చిన కృష్ణా పత్రికాసంపాదకులకును, ఈగ్రంథప్రకటనలో అనేకవిధముల నాకు సహాయపడిన శ్రీయుత పువ్వాడ శేషగిరిరావుగారికిని నే నెంతయు కృతజ్ఞుడ.

ఘంటశాల
శ్రీధాతునామ సం॥ర
ఆశ్వయుజ శు ౬,
౨౧—౧౦—౧౯౩౬.

విధేయుడు,
గొట్టిపాటి వెంకటసుబ్బయ్య.



శ్రీ శ్రీ శ్రీ జుబ్దతుల్ అక్రాన్ శ్రీమంతు

రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్

చల్లపల్లి రాజావారికి

నాయెడగల

అభిమాన ప్రేమలకు కృతజ్ఞతాసూచకముగ

భక్తితో సమర్పించిన

కానుక.



శ్రీ శ్రీ శ్రీ జుబ్దతుల్ అర్కాన్ శ్రీమంతు

రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్

చల్లపల్లి రాజావారికి

నాయెడగల

అభిమాన ప్రేమలకు కృతజ్ఞతాసూచకముగ

భక్తితో సమర్పించిన

కానుక.

# వి ష య సూ చి క

## ప్రథమకల్పము.


ప్రస్తావన ... ౧

వక్త ... ౩

పాత్ర ... ౬

సమయము ... ౧౩


## ద్వితీయకల్పము.


ప్రథమాధ్యాయము ... ౨౩

సంజయుని దివ్యదృష్టి ... ౩౪

దుర్యోధనుని వాక్కౌశలము ... ౩౭

పూర్వసూచన ... ౪౧

విషాదమునకు మూలకారణము ... ౪౩

వైష్ణవమాయాప్రవేశము ... ౪౫

వైష్ణవమాయాలక్షణములు ... ౪౭

వైష్ణవమాయయొక్క క్షుద్రత్వము ... ౫౦

కులనాశనవిషయము ... ౫౩

విద్య - అవిద్య ... ౫౪

శ్రీకృష్ణుని రాజకీయోద్దేశము ... ౬౧

భ్రాతృవధ - కులనాశనము ... ౬౪

శ్రీకృష్ణునిరాజనీతిఫలితము ... ౭౧

## తృతీయకల్పము.


ద్వితీయాధ్యాయము ... ౮౧
శ్రీకృష్ణుని జవాబు ... ౮౨
కృప - దయ ... ౮౩
అర్జునుడు శ్రేయోమార్గము తెలుప వేడుట ... ౮౪
మృత్యువు అసత్యము ... ౯౫
మాత్రలు ... ౯౮
సమభావము ... ౯౯
సమత్వగుణము ... ౧౦౦
దుఃఖమును జయించుట ... ౧౦౧
అనుబంధము ... ౧౦౩


---

# ప్రస్తావన.

భగవద్గీత ప్రపంచములోనికెల్ల శ్రేష్ఠమైన మత గ్రంథము. గీతలో సంక్షేపముగా చెప్పబడిన జ్ఞానము చరమావధిని పొంది నిగూఢమై యున్నది. ఇందులో పేర్కొనబడిన ధర్మనీతిలో సకలధర్మనీతులు అంతర్నిహితములై యున్నవి. దీనిలో చెప్పబడిన కర్మమార్గము విశ్వాభ్యుదయ సనాతనమార్గము.

గీత, అసంఖ్య రత్న గర్భమైన అగాధసముద్రము. జీవితకాలమంతయు ఆసముద్రములో గడపినను, దాని గభీరత తెలియరానిది; ఊహింపను రానిది; అడుగుభాగము పొంద జాలనిదియు. శత సంవత్సరము లన్వేషించినను, ఆ అనంతరత్నభాండారములో సహస్రాంశమైనను పొందుట దుష్కరము. అయినను ఒకటి రెండు రత్నములు, లభించినను దరిద్రుడు ధనికుడుగను, చింతాకులుడు జ్ఞానిగను, భగవద్విద్వేషి భక్తుడుగను, మాఱుదురు. మహాపరాక్రమవంతుడగు కర్మవీరుడు తన జీవితోద్దేశము సాధించుటకు కవచధారియై కర్మక్షేత్రమున ప్రవేశించి జయించగలడు.

గీత అసంఖ్యాకమైన మణులగని. ప్రజలు ప్రతియుగమున ఈ గనిలోని మణుల తీసికొనవచ్చును. సర్వదా ఇందలి వినూత్నమాణిక్యములను పొంది సంతుష్టులును ఆశ్చర్యాన్వితులును కాగలరు.

ఇవ్విధముగా గీత గభీరగు ప్రజ్ఞానపూర్ణగ్రంథమైనను భాష మిక్కిలి తేలిక; రచన బహుసరళము; బాహ్యార్థము తేట తెల్లము. గీతాసముద్రమున పైపై విహరించినను, లోపలికి మునుగక పోయినను, కొంతశక్తిని ఆనందమును కలుగజేయును. రత్నగభీరమగు గీతాసముద్రపు పరిసరములకు పోయినను, తృణమధ్యగతములగుమణుల పొంది ఇహజీవితమున ధనికులు కాగలరు. గీతపై వేలకొలదివ్యాఖ్యానములున్నను ఇక నూతన వ్యాఖ్యానములవల్ల ప్రయోజన ముండజాలదనుకాల మెన్నడును రాజాలదు. ఎట్టి జగదేకపండితుడైనను, జ్ఞానియైనను, దానిని తాను హృదయంగమము చేసికొంటిననియు ఇక గీతపై వ్యాఖ్యానము చేయుట వ్యర్థమనియు, సమస్తార్థము తెలిసికొంటిననియు చెప్పదగిన వ్యాఖ్యానము చేయజాలడు. మేధస్సర్వమును ధారవోసినను ఈజ్ఞానమున నొకానొక దిక్కుమాత్రమే తెలిసికొని తెలుపగలడు. బహుకాలము యోగమగ్నుడైనను నిష్కామకర్మమార్గమున ఉచ్చమునుండి ఉచ్చతమ స్థానము పొందినప్పటికిని గీతోక్త సత్యములలో నేకొలదియో పొందితిననిగాని గీతలో చెప్పబడిన ఒకటిరెండు సంగతులు తన జీవితమున సాధించగలిగితినని మాత్రమే చెప్పగలడు. ఈ లేఖకుడు ఎంతవఱ కుపలబ్ధిపొందెనో, ఎంతవఱకు కర్మమార్గము అభ్యసించెనో, విచార వితర్కద్వారముల నెట్టి అర్థమును గ్రహించెనో, దానిని ఇతరులసహాయార్థము తెలుపుటయే, ఈ గ్రంథరచనోద్దేశమై యున్నది.

## వక్త.

గీతయొక్క ఉద్దేశార్థములు తెలిసికొనుటకు పూర్వము అందలివక్త, పాత్ర, అప్పటిసమయము తెలిసికొను టవసరము. వక్త శ్రీకృష్ణభగవానుడు. పాత్రి ఆయనప్రాణసఖుడును వీర వతంసమును అగు విజయుడు. స్థితి కురుక్షేత్ర సంగరరంగమున శస్త్రప్రయోగారంభకాలము.

అనేకులు మహాభారతము రూపకమనియు, శ్రీకృష్ణుడు భగవానుడనియు, అర్జునుడు జీవుడనియు, ధృతరాష్ట్రాదులు రిపులనియు, పాండవసేన ముక్తి కనుకూలవృత్తియనియు చెప్పుదురు. ఇందువలన కావ్యజగత్తులో భారతమునకు హీన స్థానమిచ్చుటయు, అటులనే గీతయొక్క గభీరతను, కర్మయోగి జీవితోపయోగమును, మానవజాతియొక్క ఉత్కృష్ట జ్ఞాన మును హ్రస్వపఱచుటయు నష్టపఱచుటయు నైయున్నది. కురుక్షేత్ర సంగ్రామము కేవలగీతాపటమునకు "ఫ్రేము" కాదు. అయ్యది గీతోక్తబోధకు మూలకారణము, గీతా ధర్మము పొందుట కుత్తమ క్షేత్రము. కురుక్షేత్ర సంగ్రా మము కాల్పనికమని తలచిన గీతాధర్మము, వీరధర్మమును ప్రపంచములో ఆచరింప దగిన ధర్మముగాక, ప్రపంచమునకు నిరుపయోగమైన శాంతసన్యాసధర్మముగా పరిగణింపబడును.

గీతచెప్పినది శ్రీకృష్ణుడు. శాస్త్రములు శ్రీకృష్ణుడు స్వయముగా భగవంతుడని చెప్పుచున్నవి. గీతలో కూడ శ్రీకృష్ణుడు తాను భగవంతుడనని పల్కెను. నాల్గవ అధ్యా యములోని అవతారవాదమును, పదవ అధ్యాయములోని

విభూతివాదమును, అనుసరించి భగవంతుడు సర్వభూతములలో పరిచ్ఛన్నముగా అధిష్ఠించియు, కొన్ని కొన్ని భూతములందు శక్తియొక్క వికాసవిషయమునందు కొంతగా వ్యక్తమైనట్లుగను, శ్రీ కృష్ణుని దేహములో పూర్ణాంశరూపముగను అవతరించినట్లు చెప్పబడెను. అనేకులు కురుక్షేత్రసంగ్రామము రూపకమనియు ఆరూపకమును వర్జించి, గీతలోని అసలు సంగతిని మాత్రము గ్రహించ వలెననియు నందురు. కాని గీతాబోధయొక్క ఈఅంశమును తీసివేయ వీలులేదు. అవతారవాదమున్న శ్రీకృష్ణు నెందులకు తోసివేయవలెను? కనుక స్వయముగా భగవంతుడే ఈజ్ఞానవిద్యాబోధకుడు.

శ్రీకృష్ణావతారము మానవరూపమును దాల్చి శారీర మానసిక ఆధ్యాత్మిక ధర్మముల గ్రహించి, తదనుసారముగ లీల యొనర్చెను. ఈలీలాప్రకాశమును ఈ గూఢవిద్యయును గ్రహించగల్గినచో, ఈజగద్వ్యాపకమైన లీలార్థము, ఉద్దేశము, ప్రణాళిక, తెలియనగును. ఈమహాలీలయొక్క ప్రధానాంగము పూర్ణజ్ఞాన ప్రవర్తితకర్మ. ఆకర్మమధ్యను ఆలీలయొక్క మూలమునందును ఎట్టిజ్ఞానము నిహితమై యున్నదియో అదియే గీతలో చెప్పబడెను.

మహాభారతమున శ్రీకృష్ణుడు కర్మవీరుడు, మహాయోగి, మహాసంసారి, సామ్రాజ్యస్థాపకుడు, రాజనీతిజ్ఞుడు, యోధుడు, క్షత్రియ దేహమున బ్రహ్మజ్ఞాని. ఆయనజీవితమున మహాశక్తియొక్క వికాసమును రహస్యమయ క్రీడయు చూడనగును. ఈరహస్యముయొక్క వ్యాఖ్యానమే గీత.

శ్రీకృష్ణుడు జగత్ప్రభువును, విశ్వవ్యాపియునగు వాసుదేవుడు. అయినను స్వీయమహిమను పరిచ్ఛిన్నము చేసి పితృపుత్రభ్రాతృభర్తృ మిత్రాదిసంబంధముల దాల్చి లీల జరిపెను. ఆయనజీవితమున ఆర్యజ్ఞానముయొక్క శ్రేష్ఠ రహస్యము, భక్తిమార్గముయొక్క ఉత్తమబోధ నిహితమై యున్నవి. వాని తత్త్వములు గీతాంతర్గతములై యున్నవి. శ్రీకృష్ణుడు ద్వాపర, కలియుగములసంధికాలమున పూర్ణాంశరూపమున అవతరించెను. ప్రతికల్పమున అట్టి సంధికాలమున భగవానుడు పూర్ణాంశరూపమున అవతరించును. కలియుగము చతుర్యుగములమధ్య నెంత నికృష్టమైనదో అంత శ్రేష్ఠమైనది. ఈయుగము మానవోన్నతికి ప్రధానశత్రువును పాపప్రవర్తకుడునైన కలియొక్క రాజ్యకాలము. మానవులపతనము అధోగతియును కలియొక్క రాజ్యకాలమున కలుగును. కాని, కష్టములతో పోరాడిన శక్తి కలుగును. ప్రాతది నశించుటచేతనే క్రొత్తది సృజింపబడును. కలియుగసందర్భమునను నీనియమము కానవగును. జగత్తుయొక్క క్రమవికాసమునకు అశుభముయొక్క ఏఅంశము వినాశనమగుచున్నదో, అది కలియుగమున యెక్కువగా నాశనమగుచున్నది. అందువల్ల నీవిధముగా కలియుగమున నూతనబీజము నాటబడి అంకురించి ఆబీజము సత్యయుగములో వృక్షము కాగలదు. ఇంతేగాక ఏవిధమున జ్యోతిషములో ఒక గ్రహముయొక్క దశలో గ్రహము లన్నిటియొక్క అంతర్దశలు అనుభవింపబడునో, అవ్విధముననే కలియొక్క దశలో కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు వానివానిఅంతర్దశలు

వరుసగా అనుభవింపబడును. ఈవిధమున చక్రగతిని కలియుగమున ఘోరపతనము, తర్వాత ఉన్నతి, తిరిగి పతనము, అనంతర మున్నతి, పొందుటచే భగవానునిఉద్దేశము నెఱవేర్పబడును. ద్వాపర కలియుగముల సంధికాలమున భగవంతుడవతరించి, చెడును పెంపొందజేసి అశుభనాశనమును, శుభబీజారోపణయు, అంకురము ప్రకాశించుటకు అనుకూలావస్థయు కలుగచేసిన అనంతరము కలి ప్రారంభమాయెను. శ్రీకృష్ణుడు గీతలో సత్యయుగమున కుపకరించు గూఢమైన జ్ఞానకర్మమార్గముల బోధించెను. కలియుగములో కృతయుగాంతర్దశాగమనకాలమున గీతాధర్మము విశ్వవ్యాపకత తప్పక పొందగలదు. ఇందులకు తార్కాణముగా గీతయొక్క ఆదరణ ఏదో కొంతమంది పండితుల యొక్కయు జ్ఞానుల యొక్కయు మధ్యనే నిబద్ధముగాక పామరులందును పరదేశములందును విస్తృతి పొందుచున్నది.

కనుక వక్తయగు శ్రీకృష్ణునినుండి గీతావాక్యమును విడదీయరాదు. శ్రీకృష్ణుడు గీతలో ప్రచ్ఛన్నుడై యున్నాడు. గీత శ్రీకృష్ణునివాఙ్మయమూర్తి.

## పాత్ర.

గీతోక్త జ్ఞానముయొక్క పాత్ర పాండవశ్రేష్ఠుడును, మహావీరుడును, ఇంద్రతనయుడును అగు అర్జునుడు. ఎటుల వక్తను తీసివేసిన, గీతోద్దేశము, నిగూఢార్థము గ్రహించుట కష్టమో అటులనే పాత్రను తీసివేసిన ఆ అర్థమునకు హాని కలుగును.

అర్జునుడు శ్రీ కృష్ణుని సఖుడు. శ్రీకృష్ణుని సమకాలికులై ఒకే కర్మక్షేత్రమున అవతరించిన వారు మానవ దేహ ధారియైన పురుషోత్తమునితో తమ పూర్వ కర్మాను సారముగా అనేకవిధముల సంబంధము కల్గి యుండిరి. ఉద్ధవుడు శ్రీ కృష్ణుని భక్తుడు. సాత్యకి ఆయనసహచరుడును, అనుచరుడును. యుధిష్ఠిరుడు ఆయనవాక్యానుసారముగా నడచు ఆత్మీయుడు. అయినను అర్జునునివలె శ్రీ కృష్ణునితో సన్నిహిత సంబంధము ఏర్పఱచుకోజాలక పోయిరి. సమవయస్కుల మైత్రిలో గల మాధుర్యము శ్రీ కృష్ణార్జునులలో పూర్తిగా కలదు. అర్జునుడు శ్రీకృష్ణుని మేనమఱదియు ప్రియ సఖుడును. ఇంతియ కాదు, ప్రాణసదృశ సోదరియగు సుభద్రకు భర్త. ఇట్టి సన్నిహితత్వమువలననే అర్జునుని గీతా రహస్య శ్రవణమునకు యోగ్యునిగ నిర్దేశించినట్లు చతుర్థాధ్యాయమున భగవానుడు పలికెను.

"సఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్."

"పురాతనమైన ఈలుప్తయోగమును నేడు నేను నాకు భక్తుడవును సఖుడవును అగుటచే నీకు చెప్పుచున్నాను. ఏలనన ఈయోగము జగత్తులో శ్రేష్ఠమును పరమరహస్యమును నై యున్నది." పదునెనిమిదవ అధ్యాయములో గీతా కేంద్ర స్వరూపమగు కర్మయోగమూలమంత్రము తెలియ చెప్పునప్పుడు కూడ తిరిగి అదే పలికెను.

"సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్."

"శ్రేష్ఠమైనదియు అతిరహస్యమైనదియు అగు నామాట మఱల వినుము. నీవు నాకు మిక్కిలిప్రియుడవు. ఆకారణము చేతనే నీకు శ్రేష్ఠమార్గమును జెప్పుచున్నాను" ఈశ్లోకముల రెంటి తాత్పర్యము శ్రుతికనుకూలము.

కఠోపనిషత్తులో ఈ విధముగా చెప్పబడెను:—

"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైషవృణుతే తేనలభ్యస్తస్యైష ఆత్మావృణుతే తనూంస్వామ్"

"ఈ పరమాత్మ వేదాధ్యయనమువల్లగాని మేధాశక్తి వల్లకాని విస్తారశాస్త్రజ్ఞానముచేతగాని పొందబడడు. భగవంతుడు ఎవ్వరిని గ్రహించునో వారికే లభ్యమగును, వారికే ఈపరమాత్మ స్వీయస్వరూపము ప్రకటింపచేయును" కనుక ఈశ్వరునితో సఖ్యాది సంబంధము పొందుట కర్హులైనవారే గీతాజ్ఞానము పొందుట కర్హులు. ఇందులో తెలిసికోవలసిన సందర్భము మఱియొకటి కూడ యిమిడియున్నది. భగవంతుడు అర్జునుడు తనకు భక్తుడు, సఖుడు అనివచించెను. భక్తులు పలు విధముగా నుందురు. సాధారణముగా భక్తుడన్న గురుశిష్య సంబంధము మనస్సులో కలుగును. ఆభక్తిలో ప్రేమయుండుట నిజమైనను, సాధారణముగా బాధ్యత, గౌరవము, మూఢభక్తి- దానియొక్క విశేషలక్షణములు. సఖుడు సఖుని గౌరవించడు; అతనితో ఆటలాడును; హాస్యములాడును; సంతోషపూర్వకమైన సంభాషణచేయును; వేడుకకొఱకు పరిహసించును. అవజ్ఞ

చేయును; తిట్టును. అతనిమీద అత్యాచారము చేయును. మిత్రు డెల్లప్పుడును మిత్రునికి బాధ్యుడుకాడు. అతనిజ్ఞానగరిమయం దును, నిష్కపటహితైషితయందును ముగ్ధుడై, అతని ఉపదే శానుసారము నడచును. కాని అంధభావమున కాదు. అతనితో తర్కించును. సందేహములన్నిటిని జెప్పును. మధ్యమధ్య అతని అభిప్రాయములను ఖండించును. భయపడకుండుట మిత్రత్వము నకు ప్రథమలక్షణము. బాహ్యాడంబరమైన గౌరవము చూప కుండుట ద్వితీయలక్షణము. దాని ఆద్యంతములు ప్రేమయే. ఎవ్వ డీ ప్రపంచమును మధురమును రహస్యమయమును ప్రేమా బద్ధమును ఆనందక్రీడాసమన్వితముగాను తెలిసికొని భగవం తుని లీలాసహచరునిగా నెన్నుకొని సఖుడు కాగలడో వాడే గీతాజ్ఞానము పొందుట కర్హుడు. ఎవ్వడు భగవంతుని మహిమ ప్రభుత్వము జ్ఞానగరిమ భీషణత్వమును హృదయంగమము చేసికొని అభిభూతుడుగాక ఆయనతో నిర్భయముగ చిరునగ వుతో ఆటలాడునో వాడు గీతాజ్ఞానము పొంద పాత్రుడు. సఖ్య సంబంధములో క్రీడారంగములోని సకలసంబంధములు అంత ర్భుక్తములు కాగలవు. గురుశిష్య సంబంధమున సఖ్యతకలిగిన మిక్కిలి ఆనందముకలుగును. ఇట్టిసంబంధమె అర్జునుడు గీతా ప్రారంభమున శ్రీకృష్ణునితో ఏర్పరచుకొనెను. "నీవు నాహితము కోరు మిత్రుడవు. నిన్నుగాక నే నెవరి శరణుజొత్తును? నేను హతబుద్ధిని. కర్తవ్యభారముచే భీతుడను. కర్తవ్య విషయములో శంకాన్వితుడను. నీవు నన్నురక్షించుము, ఉపదేశము చేయుము. నాఐహికాముష్మికలాభములభారమంతయు నీమీద వేసితిని."

ఇవ్విధముగా అర్జునుడు, మానవసంఘసఖుడును సహాయుడును అగు శ్రీకృష్ణ భగవానునియొద్ద జ్ఞానము పొందవచ్చెను. మఱియు మాతృసంబంధమైన వాత్సల్యభావముకూడ సఖ్యత్వములో కలదు. వయోజ్యేష్ఠుడును, జ్ఞానశ్రేష్ఠుడును అగు మిత్రుడు అల్పవిద్యగల సఖునైనను తల్లివలె ప్రేమించును. రక్షించును. ఎవడు శ్రీ కృష్ణునితో సఖ్యముచేయునో వానికి శ్రీకృష్ణుడు కన్నతల్లివలె కాన్పించును. సఖులలో ఎట్టిగాఢమైన మాతృప్రేమ కలదో అట్టి దాంపత్యప్రేమానందమును గలదు. మిత్రులొండొరుల వేడుకొందురు. ఒండొరు లెడబాసినపుడు దుఃఖింతురు. వారు దేహస్పర్శచే పులకితులగుదురు. వారు ఒకరికొఱకొకరు ప్రాణముల నైనను ఆనందముతో విసర్జింపగలరు. దాస్య సంబంధములో ఇట్టి సఖ్యత్వవిషయికానందము గలదు. ఎవ్వడెంత ప్రేమసంబంధమును పురుషోత్తమునితో స్థాపించుకొనగలుగునో వాని సఖ్యభావమంత అభివృద్ధి చెంది తర్వాత గీతాజ్ఞానము పొంద పాత్రుడగును.

కృష్ణుని చెలికాడగు అర్జునుడు మహాభారతములో ప్రధాన కర్మయోగి. గీతలో కర్మయోగ విద్యయే ప్రధాన విద్య. జ్ఞానము, భక్తి, కర్మ ఈమూడును పరస్పర విరోధ మార్గములు కావు. జ్ఞానభక్తిమయమైన కర్మమార్గమున లబ్ధమైన శక్తిని ఈశ్వరేచ్ఛలో లీనమొనర్చి ఈశ్వరాదేశానుసారము కర్మచేయుటయే గీతయొక్క బోధ. ఎవరీప్రపంచ దుఃఖమునకు భీతులై, విరాగులై, భగవానుని లీలయందు

ఇష్టములేనివారలై లీలను వదలి అనంతునిఅంకమున దాగుకొన గోరుదురో వారి మార్గము వేఱు. వీరశ్రేష్ఠుడును మహా ధనుర్ధరుడునగు అర్జునునికి అట్టియిచ్ఛగాని భావముగాని లేదు. శ్రీకృష్ణుడు శాంతి కోరు సన్యాసియెదుట గాని, వేదాంతి యెదుట గాని యీ ఉత్తమరహస్యమును ప్రకటించలేదు. అహింసాపరాయణుడగు నొకబ్రాహ్మణుడు ఈవిద్య పొందుట కర్హుడని తలచి నిర్ణయించక మహా బలపరాక్రమవంతుడగు క్షత్రియ యోధునే ఈఉత్తమజ్ఞానము పొందుట కర్హత కలవానినిగా నిర్ణయించెను. ఎవ రీప్రపంచ పోరాటములో జయాపజయము లొందినను చలింపకుండునో వాడే ఈ బోధ యొక్క గూఢార్థమును గ్రహించ గలడు. "నాయమాత్మా బలహీనేన లభ్యః" ముముక్షుత్వము పొందుటకన్న ఈశ్వరునే పొంద నెవడు కోరునో, వాడు భగవత్సన్నిధానానందము పొంది, తాను నిత్యముక్త స్వభావుడ నని యుపలబ్ధి పొంది ముముక్షుత్వము, అజ్ఞానముయొక్క ఆఖరుదశయని తలచి వర్తించగలడు. తామసికాహంకారమును వీడి, సాత్త్వికాహంకారమునకు లోనును గాక, ఎవ డుండునో వాడు గుణాతీతుడుకాగలడు. అర్జునుడు క్షత్రియధర్మము నిర్వర్తించుటకు రాజసవృత్తిని సంపాదించుటయే గాక, సాత్త్వికాదర్శమును గ్రహించుటకు రజశ్శక్తిని సాత్త్విక మొనర్చెను. ఇట్టివాడే గీతాబోధను పొందుటకు ఉత్తమాధికారి.

అర్జునుడు అతనిసమకాలికమహాపురుషులలో శ్రేష్ఠుడు కాడు. ఆధ్యాత్మిక జ్ఞానములో వ్యాసుడు శ్రేష్ఠుడు. ప్రపం

చిక జ్ఞానములో భీష్ముడు శ్రేష్ఠుడు. జ్ఞానతృష్ణలో ధృతరాష్ట్రవిదురులు శ్రేష్ఠులు. సాధుసత్త్వగుణములకు ధర్మతనయుడగు యుధిష్ఠిరుడు శ్రేష్ఠుడు. భక్తిలో అక్రూర ఉద్ధవులు శ్రేష్ఠులు. స్వభావసిద్ధమైన శౌర్య పరాక్రమములలో మహారథుడగు కర్ణుడు శ్రేష్ఠుడు. అయినను జగత్ప్రభువు అర్జునునే స్వీకరించి, వాని హస్తమున దిగ్విజయము నొసంగు గాండీవాది దివ్యఅస్త్రముల నుంచి, వానిద్వారమున భరత ఖండమున వేలకొలది జగద్విఖ్యాత యోధులను సంహారింపచేసి, యుధిష్ఠిరునకు అసపత్న సామ్రాజ్యమును వానిపరాక్రమముచేదానపూర్వకముగ సంస్థాపనజేసెను. ఇంతేగాక గీతాజ్ఞానము పొందుట కతని నొక్కనినే తగినవానిగా నిర్ణయించెను. మహాభారతమున అర్జునుడు నాయకుడు. ప్రధానకర్మయోగి. ఆకావ్యములోని ప్రత్యంశము వాని కీర్తిని గూర్చి ఘోషించుచున్నది. ఇందు పురుషోత్తమునిదిగాని మహాభారతకర్తయగు వ్యాసునిదిగాని పక్షపాతము లేదు. ఈ శ్రేష్ఠత్వము, సంపూర్ణ శ్రద్ధ, ఆత్మసమర్పణముల ఫలితము. ఎవడు పురుషోత్తమునిపై సంపూర్ణవిశ్వాసముకలవాడై ఎట్టికోరికయు లేక, స్వీయశుభాశుభముల, పాపపుణ్యములసమస్తభారము అతనికి సమర్పించి, వాని ఆదేశానుసారము కర్మ చేయుచు స్వీయప్రవృత్తిని విడచి, భగవత్ప్రేరిత వృత్తిని గ్రహించి, భగవద్దత్తమైన గుణమును, ప్రేరణను, ఆయనకార్యములం దుపయోగించునో అట్టి శ్రద్ధాన్వితుడును, అహంకార రహితుడును అగు కర్మయోగి పురుషోత్తమునిప్రియసఖుడును, శక్తిసమన్వితుడును

అగును. ప్రపంచములో వానిద్వారమున మహాకార్యములు నిర్దోషముగ జరుగును. ఇస్లాముమతకర్తయగు మహమ్మదు ఇట్టి యోగిశ్రేష్ఠుడే. అర్జునుడు ఇట్టి ఆత్మసమర్పణ చేయుటకు సదా సంసిద్ధుడై యుండెను. ఇందులకు శ్రీకృష్ణుని ప్రసన్నత, ప్రేమ, కారణములు. ఎవడు సంపూర్ణముగ ఆత్మసమర్పణ చేయునో వాడే గీతాజ్ఞానము పొంద నుత్తమయోగ్యుడు. శ్రీకృష్ణుడు అతనికి గురువును సఖుడును అయి వాని ఇహపరలోకముల సమస్తభారమును వహించును.

## సమయము.

మానవుని ఏకార్యమునకైనను, లేక మాటయొక్క ఉద్దేశమునకైనను కారణమును పూర్తిగా గ్రహించవలెనన్న ఎట్టిసమయమున ఆమాట లేక పని జరిగెనో దానిని తెలిసికొనుట ఆవశ్యకము. కురుక్షేత్రసంగ్రామ ప్రారంభకాలమున శస్త్రప్రయోగారంభము కానున్నతఱిని "ప్రవృత్తేశస్త్రసంపాతే" ఆసమయమున భగవానుడు గీత చెప్పెను. దీనికి కొందరు విస్మితులును విరక్తులునై ఇది కవియొక్క అజాగ్రత్త లేక బుద్ధిజాడ్యమనెదరు. నిజముగా అట్టిసమయమున ఆ స్థానమున అవ్విధమైన భావాకులమైనవానికే దేశకాలపాత్రత లెరుకపఱిచి, శ్రీకృష్ణుడు గీతోక్తజ్ఞానమును గఱపెను.

సమయము యుద్ధారంభకాలము. ఎవడు ప్రబల కర్మప్రవాహమున తన వీరత్వము బలము పరీక్షించుకొనడో వాడెప్పుడును గీతాజ్ఞానము పొంద నధికారికాడు. ఇంతేగాక

కఠినవ్రతము నారంభించువాని కనేక విఘ్నములును శత్రు వృద్ధియు అపజయావకాశము సాధారణముగా నుండును. ఆ మహావ్రతమాచరించుటచే ఎపుడు దివ్యశక్తి కలుగునో అప్పు డావ్రతపూర్తికొరకు భగవానుని కార్యసిద్ధికొఱకు ఈజ్ఞా నము కలుగును. గీతలో చెప్పబడిన కర్మయోగము ఈశ్వరుని పొంద నర్హుని చేసి భక్తియుతకర్మలోనే జ్ఞానము కల్గించును. కాన అతడు దూరమున నున్న శాంతిప్రదాశ్రమమునగాని, పర్వతమునగాని, నిర్జనస్థానమునగాని, ఈశ్వర సాక్షాత్కార మును పొందక, కర్మయోగముననే స్వర్గకాంతిని పొంద గలు గును. భగవానుని మధుర తేజోమయ వాక్కు వాని కర్ణకుహ రమున ప్రవేశించును.

స్థానము యుద్ధరంగము. ఉభయసేనల మధ్యస్థలము. ఇంతేగాక అది శస్త్రప్రయోగారంభకాలము. ఎవడీమార్గాను వర్తియై, కర్మాచరణయం దగ్రేసరుడగునో, వానికి విషమ సమయ మాసన్నమై, ఉత్తరణమార్గమున యోగసంసిద్ధియు, జ్ఞానమును, తప్పక కలుగును. ఆజ్ఞానము కర్మనిరోధకము కాదు; కర్మసహితమై యుండును. నిర్జన ప్రదేశమున స్వస్థ చిత్తునకు ధ్యానమువల్ల జ్ఞానోదయముకల్గుట సత్యమే. అందు వలననే మనీషావంతులు నిర్జనప్రదేశమున నుండుట కిచ్ఛగిం తురు. కాని గీతామార్గావలంబియైన యోగి జనులమధ్య నుండియు నిర్జనప్రదేశమున నున్నట్లుండును. కోలాహలము నందు శాంతిని కర్మయందు నివృత్తిని అనుభవించును. బాహ్య స్థితి వాని ఆంతరంగిక స్థితిని మార్పజాలదు. అతడు ఆంతరంగిక

స్థితినిబట్టి బాహ్యస్థితిని మార్చుకొనగలడు. సాధారణయోగి
ప్రపంచమును జూచి భయపడి, పాఱిపోయి, యోగాశ్రమ
మందు శరణుజొచ్చి యోగమొనర్చును. ప్రపంచమే కర్మ
యోగికి యోగాశ్రమము. సాధారణయోగి బాహ్యశాంతిని
కోరును. శాంతికిభంగముకలిగిన, వానికి తపోభంగము కలు
గును. కాని కర్మయోగి మనస్సునం దెక్కువ శాంతి కల్గియుండు
టచే బాహ్యకోలాహలమునెడ మఱింత శాంతికలిగియుండును.
కాన అతని కెట్టి తపోభంగమును గలుగక స్థిరచిత్తుడై
యుండును. సమరోద్యుక్త సైన్యమధ్యమున శ్రీకృష్ణార్జునుల
సంవాద మెటుల సంభవమాయెనని అనేకు లందురు. దానికి
సమాధానము యిది:— అది యోగప్రభావమున జరిగెను.
ఆ యోగబలముచే ఆ కోలాహలమునగూడ శ్రీకృష్ణార్జునుల
మనస్సులు శాంతముగా నుండెను. ఆ యుద్ధ కోలాహలము
వారి నుభయుల స్పృశింపజాలకయుండెను. ఇందు కర్మోప
యోగమైన మరియొక ఆధ్యాత్మిక విషయముకూడ ఇమిడి
యున్నది. గీతాయోగాభ్యాస మొనర్చువాడు శ్రేష్ఠమైన
కర్మయోగియేగాక, కర్మయం దనాసక్తుడుకూడ. కర్మ
మధ్య నున్నవాడు అంతర్వాణీ ప్రేరితుడై, కర్మను వీడి
యోగమగ్నుడును తపోరతుడును అగును. వాడు కర్మను,
ఫలమునుకూడ భగవానునిగా నెంచి తా నొకయంత్రమని తల
చును. కాన కర్మఫలమునం దాసక్తుడు కాడు. కర్మయోగ
విధికిని, కర్మోన్నతికిని, జ్ఞానవృద్ధికొఱకును, శక్తివృద్ధికిని ఈ
ఆహ్వానము వచ్చినట్లుగా తలచును. కనుక కర్మను వీడుటకు

భయపడడు. తపస్సు చేయుట ఎన్నటికిని వృథాకాలహరణము కాదని కూడ తలచును.

పాత్రియొక్క భావము; కర్మయోగియొక్క శేష సందేహపుటు దేశికము. ప్రపంచ సమస్య, సుఖదుఃఖ సమస్య, పాపపుణ్య సమస్యలను పరిష్కార మొనర్పజాలక, వానికి దూరముగా నుండుటయే శ్రేయస్కరమని తలచి, నివృత్తిని, వైరాగ్యమును, కర్మత్యాగమును బహుగొప్పగా అనేకులు ప్రశంసింతురు. బుద్ధుడు జగత్తు అనిత్యమనియు దుఃఖమయమని తెలిపి నిర్వాణము పొందుమార్గము చూపెట్టెను. ఏసుక్రీస్తు, టాలస్టాయి, మొదలగువారు సంతాన వృద్ధికరమగు వివాహ పద్ధతికిని ప్రపంచముయొక్క అనాదినియమమైన యుద్ధమునకును ఘోరవిరోధులు. కర్మ అజ్ఞానమువల్ల కల్గుననియు, అజ్ఞానమువర్జించి, కర్మను వీడి నిష్క్రియులై శాంతముగనుండుడని సన్యాసులు చెప్పుదురు. అద్వైతులు జగత్తు మిథ్యయని బ్రహ్మమునందు లీనముకమ్మందురు. అటులైన ఈ జగత్తెందుకు? భగవంతుడున్నయెడల తెలియని చిన్న పిల్లవానివలె, ఈ వృథాశ్రమ నేల యారంభించెను? ఆత్మ నిత్యమును జగత్తే మిథ్యయు నైనయెడల ఆత్మ యేల యీ పనికిమాలిన స్వప్నములో తన నిర్మల స్వభావమును అధ్యారోప మొనర్చుకొనెను? ఇక నాస్తికులు భగవంతుడు లేడు, ఆత్మ లేదు, ఒక అంధశక్తియొక్క అంధక్రియమాత్రమున్నదందురు. అది మాత్రమెటుల నమ్మదగును? శక్తి ఎవరిది ? ఎచటనుండి సృష్టింపబడెను ? ఏల అంధోన్మత్త

యమ్యెను? ఈ ప్రశ్నల నన్నిటిని సరిగా నెవరును మీమాంస చేయజాలరు. క్రైస్తవులుగాని, బౌద్ధులుగాని, అద్వైతులు గాని, నాస్తికులుగాని, విజ్ఞానశాస్త్రజ్ఞులుగాని, ఈవిషయమై ఏమియు సమాధానము చెప్పజాలక, విషయమును పరి వర్తన మొనర్చి తప్పించుకొందురు. ఉపనిషత్తులు, గీత ఈరెండే సరియైనసమాధానము నిచ్చును. అందుననే కురు క్షేత్ర సంగ్రామమున గీత చెప్పబడెను. గురుహత్య, భ్రాతృ హత్య, స్వజన సంహారము, వేలకొలది ప్రాణుల హత మొనర్చుట ఘోరకర్మగా తలచి, యుద్ధారంభమున అర్జునుడు హతబుద్ధియై గాండీవమును హస్తమునుండి జారవిడచి గద్గద స్వరమున వచించెను.

"తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ"

"నన్నేల ఈ ఘోరమైన కర్మయందు ప్రవేశపెట్టెదవు"

దీనికి సమాధానముగ ఆయుద్ధకోలాహలముమధ్య నుండి, వజ్రగంభీరస్వరముతో భగవానుని నోటనుండి, మహా గీత వెలువడెను:—

'కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతం'

'యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ'

'బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే

తస్మాద్ యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్'

'అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః'

'మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా

నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః'
'గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే'
'అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః'
'భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి'
'మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్'
'యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
హత్వాపి స ఇమాఁల్లోకాన్ న హంతి న నిబధ్యతే'

"కనుక నీవు కర్మే చేయవలెను. పూర్వమునుండియు నీపూర్వపురుషులు ఏకర్మ చేయుచుండిరో, ఆకర్మ నీవును చేయవలెను.

యోగమునందుండి ఆసక్తిని విడనాడి కర్మచేయుము.

యోగమునందు బుద్ధి నుంచినవాడు పాపపుణ్యముల నతిక్రమించును. కనుక నీవు యోగమునకై యత్నించుము. యోగమన కర్మసాధనయందలి కౌశలమే.

మానవుడు అనాసక్తిభావమున కర్మ నొనర్చిన, నిశ్చయముగా వాడు ఈశ్వరుని పొందును.

జ్ఞానముతో కూడిన హృదయము కలవాడవై, నీనకల కర్మలు నాయందుంచుము. ఆశాహంకారముల త్యజించి, దుఃఖమును విడనాడి యుద్ధమునకు లెమ్ము.

ఎవడు ఆసక్తిరహితుడై ముక్తుడై యుండునో, ఎవని చిత్తము సదా జ్ఞానపూర్ణమై యుండునో, ఎవడు యజ్ఞార్థము

కర్మ ఆచరించునో, వానికర్మలు బంధ హేతువులు గాక నాయందే లీనమగును.

సమస్త ప్రాణులయం దుండెడి జ్ఞానము, అజ్ఞానము ద్వారమున ఆవృతమగును. ఆకారణముచే సుఖదుఃఖములు, పాపపుణ్యములు మొదలగు ద్వంద్వముల సృజించుకొని మోహాముస పడును.

నన్ను సర్వలోకమహేశ్వరునిగను, యజ్ఞము, తపస్సు మొదలుగా సర్వకర్మలకు భోక్తగాను, సర్వభూతములకు సఖునిగను తెలిసికొనిన పరమశాంతి కలుగును.

నేను శత్రుల నందరిని వధించితిని. నీవు కేవలము యంత్రముమాదిరి వారిని సంహరించుము. దుఃఖించకుము, యుద్ధము చేయుము, యుద్ధమునందు నీశత్రుకోటిని జయించగలవు.

ఎవడు అహంకారరహితుడై యుండునో ఎవనిబుద్ధి లిప్తముకాదో వాడు ప్రపంచమునందలి సమస్తజనులను సంహరించినను వధించినవాడు కాడు. వానికి పాపము తగులదు."

ప్రశ్నను తప్పించుకొని మోసగించు లక్షణ మిందేమియు లేదు. ప్రశ్న సువిశదముగా వేయబడెను. భగవంతుడెట్టివాడో జగ త్తెట్టిదో ధర్మమార్గ మెట్టిదో గీతలో సంక్షేపముగా జవాబు చెప్పబడెను. మరియు గీతలో చెప్పబడినది సన్యాసమార్గముగాక కర్మమార్గమై యున్నది. అందుచేతనే గీత అందరికి నుపయోగమైన గ్రంథము.



# ప్ర థ మా ధ్యా య ము

ధృతరాష్ట్ర ఉవాచ:—

శ్లో. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ. ౧

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు:- సంజయా! ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున యుద్ధము జేయగోరి సమావేశమైన-నాపుత్రులును, పాండవులును ఏమిచేసిరి?

సంజయ ఉవాచ:—

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా,
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్. ౨

సంజయుడు చెప్పుచున్నాడు:- వ్యూహాకారముదాల్చిన పాండవసైన్యమును గాంచి దుర్యోధనుడు, ద్రోణాచార్యునిచెంతకేగి యిటుల నుడివెను.

పశ్యైతాం పాండుపుత్రాణామాచార్యమహతీం చమూమ్,
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా. 3

ఆచార్యా! ద్రుపదకుమారుడును, తమ శిష్యుడును, బుద్ధిమంతుడును నగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహాబద్ధమైన పాండవుల యీ గొప్పసేనను చూడుడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ, ద్రుపదశ్చ మహారథః. ४

ఈ సేనలో శూరులును, ధనుర్ధరులును, సంగరమున భీమార్జునులతో సమానులగు సాత్యకి, విరాటుడు, మహారథుడగు ద్రుపదుడును,

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. ౫

ధృష్టకేతువు, చేకితానుడు, వీర్యవంతుడగు కాశీరాజును, పురుజిత్తు, కుంతిభోజుడును, నరపుంగవుడగు శైబ్యుడును,

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. ౬

పరాక్రమసంపన్నుడగు యుధామన్యుడు, బలాఢ్యుడగు నుత్తమౌజుడును, అభిమన్యుడును, ద్రౌపదీపుత్రులును మున్నగు నీ మహారథులెల్లరు గలరు.

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ,
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. ౭

బ్రాహ్మణోత్తమా! మన సేనలో నాయకులును, ఘనులునగువారల దెలియబలుకుచున్నాను వినుడు.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః. ౮

మీారు, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమున జయమునొందు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రివుడు, జయద్రథుడును,

అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్రప్రహరణాస్సర్వే యుద్ధవిశారదాః. ౯

మరియు నానిమిత్తము ప్రాణముల నర్పించగల శూరులింక ననేకులు గలరు. వారందరు యుద్ధవిశారదులును, నానావిధశస్త్రసంపన్నులును.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్. ౧౦

భీష్మునిచే సురక్షితమైన మనసైన్య మపారము. భీమునిచే సంరక్షితమగువారి బల మల్పసంఖ్యగలది.

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వ ఏవ హి. ౧౧

కావున మీా రెల్లరు నిర్దేశింపబడిన స్థానముల యథోచితముగ నిలిచి, భీష్మాచార్యుని సంరక్షించవలయును.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.

ఈ విధమున నుడువుచున్న దుర్యోధనునకు హర్షోద్రేకము కల్గించుచు, కురువృద్ధుడును, ప్రతాపవంతుడును,

పితామహుడును నగు భీష్ముడు గొప్పసింహనాదమొనరించి శంఖమును బూరించెను.

తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః,
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్. ౧౩

అనంతరము, శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు, గోముఖములు మున్నగు రణవాద్యముల నొక్కసారి మ్రోయించిరి. ఆ ధ్వని సంకులమై అంతటను వ్యాపించెను.

తతశ్శ్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. ౧౪

పిమ్మట శ్వేతాశ్వములచే బూన్చబడిన గొప్పరథమందు గూర్చుండియున్న కృష్ణార్జునులు దివ్యములగు శంఖముల బూరించిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫

శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును భయంకరవ్యాపారయుతుడగు భీముడు పౌండ్రమను మహాశంఖమును బూరించిరి.

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ. ౧౬

కుంతీపుత్రుడగు ధర్మరాజు అనంతవిజయమును, నకు

లుడు సుఘోషమును, సహదేవుడు మణిపుష్పకమను శంఖము లను బూరించిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః. ౧౮
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,
సౌభద్రశ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్పృథక్.

మహాధనుర్ధరుడగు కాశీరాజు, మహారథుడగు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, అపజయము నెరుంగనిసాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీపుత్రులు, మహాబాహుండగు అభిమన్యుడు మున్నగు నందరును వేఱువేఱు శంఖములను బూరించిరి.

సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్.
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్. ౧౯

ఆమహాధ్వని భూమ్యాకాశముల బ్రతిధ్వనింపజేయుచు దుర్యోధనాదులహృదయముల వ్రయ్యజేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః. ౨౦
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే.

పిదప శస్త్రయుద్ధము ప్రారంభింపగా యుద్ధసన్నద్ధులై నిలచిన దుర్యోధనాదుల జూచి, కపిధ్వజుడగు అర్జునుడు ధనుస్సు నెక్కుపెట్టి శ్రీకృష్ణునితో నిట్లనియె.

అర్జున ఉవాచ:—

సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. ౨౧
యావదేతాన్ నిరీక్ష్యేఽహం యోద్ధుకామానవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. ౨౨

అచ్యుతా! ఈ సంగ్రామమున నే నెవరితో బోరవల యునో, ఈ యుద్ధసన్నద్ధులై నిలిచియున్నవారల బాగుగా గాంచుదనుక, నారథమును రెండుసేనలమధ్యను నిలువుము.

యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః. ౨౩

దుష్టబుద్ధియగు దుర్యోధనునకు యుద్ధమున హితమొన రింపగోరి వచ్చి, యుద్ధము సేయనున్నవారిని నన్ను జూడనిమ్ము.

సంజయ ఉవాచ:—

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత,
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వారథోత్తమమ్. ౨౪
భీష్మద్రోణప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. ౨౫

సంజయుడు చెప్పుచున్నాడు.

అర్జును డీ విధమున నుడివినపిదప, శ్రీకృష్ణుడు సకల రాజుల భీష్మద్రోణులయెదుట ఉభయసేనలమధ్యను రథము నుంచి ఇట్లు చెప్పెను. "అర్జునా కూడియున్న కౌరవుల జూడుము."

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రా
న్సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి. ౨౬

అపుడు అర్జును డుభయసేనలగల తండ్రులను తాత
లను గురువులను మేనమామలను సోదరులను పుత్రులను పౌత్రు
లను స్నేహితులను మామలను సుహృదయులను గాంచెను.

తాన్ సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్,
కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్. ౨౭

ఈవిధమున సకలబంధువులు యుద్ధసన్నద్ధులై యుండ
జూచి అర్జునుడు తీవ్రకృపావిష్టుడై దుఃఖించుచు ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ:—

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్,
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి. ౨౮

వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే,
గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే. ౨౯

అర్జునుడు చెప్పుచున్నాడు:-

కృష్ణా! ఈస్వజనులందరు యుద్ధమొనర్ప సమావేశ
మగుట జూచి నా దేహమందలి ప్రతిఅవయవము శిథిలమగు
చున్నది. నోరెండుచున్నది. శరీరము కంపమొందుచు గగు

ర్పాటు గలుగుచున్నది. గాండీవము చేతినుండి జారిపోవు చున్నది. చర్మము దహించుకొనిపోవుచున్నది.

న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః,
నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ. 30

నిలుచుండుటకు శక్తి చాలకున్నది. మనస్సు చలించు చున్నది. అపశకునములు కానవగుచున్నవి.

న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే,
న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ. 31

కేశవా! యుద్ధమున స్వజనమును వధించి శ్రేయమును గాంచజాలను. నాకు విజయ మక్కరలేదు. రాజ్యము వలదు. సుఖము వలదు.

కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా,
యేషామర్థే కాంక్షితంనోరాజ్యంభోగాస్సుఖానిచ. 32
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ,
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః. 33

గోవిందా! రాజ్యమేల? భోగములేటికి? జీవించియున్నం దుకు ప్రయోజనమేమి? ఎవ్వారికొఱకు రాజ్యమును, భోగము లను, సౌఖ్యములను గోరుచుంటినో వారందరు ప్రాణములను, ధనమును త్యజించి ఈయుద్ధక్షేత్రమున కరుదెంచిరి. వారెవరన ఆచార్యులు, తండ్రులు, కుమారులు, తాతలు,

మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాస్సంబంధినస్తథా,
ఏతాన్నహంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన. 34

అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే,
నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన. 35

మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు, బంధువులు, మధుసూదనా! వారు నన్ను సంహరించినను, మూడులోకములరాజ్యము నాకు రానున్నను, నేను వారిని జంపదలచుకొనలేదు. ధార్తరాష్ట్రులను సంహరించిన నాకేమి సంతోషము కలుగును?

పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః,
తస్మాన్నార్హావయంహంతుంధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ. 36

వీరు దుష్టులైనను వీరిని వధించుటచే పాపమే వచ్చును. కనుక బంధువులతో గూడియున్న దుర్యోధనాదులను వధింపరాదు. గోవిందా! స్వజనులను వధించుటచే ఎటుల సుఖము కలుగును?

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్. 37

దుర్యోధనాదులు లోభముచే మతిలేనివారై కులక్షయమువలన కలుగుదోషమును, మిత్రద్రోహముచే గలుగు పాతకమును గ్రహింపజాలరు.

కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్,
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన. 38

ఓజనార్దనా! కులక్షయముచే గలుగు కీడును గ్రహిం చిన మన మిట్టిపాపమునుండి మరలుట కేల ప్రయత్నింపరాదు!

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత. ౩౯

కులక్షయముచే సనాతనములగు కులధర్మములు నశిం చును. ధర్మము నశించుటచే అధర్మము కులమంతటను వ్యాపించును.

అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః. ౪౦

కృష్ణా! అధర్మమభివృద్ధియగుటచే కులస్త్రీలు చెడు దురు. స్త్రీలు చెడుటచే వర్ణసంకరము ఏర్పడును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః. ౪౧

వర్ణసంకరమైన కులమునకు, కులనాశకులకు నరకప్రాప్తి కలుగును. అందుచే వారి పితృదేవతలు, పిండములు, ఉదక క్రియలు లేనివారగుటచే అధోలోకమున పడుదురు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః. ౪౨

వర్ణసంకరకారకులగు కులఘాతకుల దోషముచే, సనా దిగ వచ్చుచున్న జాతిధర్మములు, కులధర్మములు నశించును.

ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన,
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. ४३

కులధర్మములు నశించిన మనుష్యులు తప్పక నరకమున బడుదురని వినుచున్నారము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. ४४

అయ్యో! యెంతవిచారకరము! మనము మహాపాపము చేయ కృతనిశ్చయుల మైనారము. అదేదన రాజ్యసుఖలోభముచే స్వజనులను సంహరించుటకు సంసిద్ధుల మైతిమి.

యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్. ४५

ఆయుధధారులగు దుర్యోధనాదులు శస్త్రమును బట్టక ప్రతిక్రియ చేయని నన్ను యుద్ధమున సంహరించినను నా కది శ్రేయస్కరమే యగును.

సంజయ ఉవాచ:—

ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః. ४६

సంజయుడు చెప్పుచున్నాడు:-

అర్జును డీవిధమున నుడివి, దుఃఖముచే వ్యాకులచిత్తుడై బాణములతో గూడిన వింటిని విడిచి యుద్ధభూమియందు రథముమీద గూర్చుండెను.

## సంజయుని దివ్య దృష్టి



గీత మహాభారతయుద్ధారంభ కాలమున చెప్పబడెను. కనుక గీతలోని ప్రథమ శ్లోకమున ధృతరాష్ట్రుడు దివ్యదృష్టిని పొందిన సంజయుని యుద్ధవార్త అడిగెను. యుద్ధరంగమునకు వచ్చిన ఉభయసేనలు ప్రథమమున నేమి చేసెనో, ఆవృద్ధరాజు తెలిసికొనగోరెను. ఆంగ్లేయభాష అభ్యసించిన ఆధునిక భారతీయ విద్యావంతుల దృష్టిలో, సంజయుని దివ్యదృష్టి కవికల్పనతప్ప మఱియొకటి కాదు. కాని ఎవరైన దూరదృష్టిని (Clairvoyance), దూరశ్రవణమును (Clair-audience) పొంది దూరముననున్న యుద్ధరంగమునుండి రోమహర్షణ దృశ్యమును, మహారథులయొక్క సింహనాదమును, నింద్రియగోచరముచేసికొనెననిన వారి కంత అవిశ్వాసము కలుగదు. కాని వ్యాసు డీశక్తిని సంజయున కిచ్చెననిన అది వట్టి సంగతియని ఎగురగొట్టెదరు. కాని ఒకానొక విఖ్యాతయిరోపా శాస్త్రజ్ఞుడు మనుష్యుని స్వప్నావస్థ పొందింపజేసి (Hypnotised) వానినోటనుండి దూరపుసంగతిని తెలిసికొనెనని చెప్పిన పాశ్చాత్య యోగనిద్ర (Hypnotism) మెరిగిన వారు ఈసంగతి మనోయోగముచేత చదివెనని విశ్వసింతురు. కాని యోగనిద్ర (Hypnotism) యోగశక్తియొక్క నికృష్టమైన భాగము మాత్రమే. మానవులలోనున్న సమస్త శక్తులను, పూర్వకాలపు సభ్యజాతు లెఱుగుటయే గాక చాల

అభివృద్ధి యొనర్చిరి. కాని కలికాలపుటజ్ఞాన ప్రవాహమున ఈ విద్య అడుగంటెను. స్వల్పాంశమేదో కొద్దిమందిచేతులలో రహస్యవిద్యగా రక్షితమై యున్నది. సూక్ష్మదృష్టి యనగా సూక్ష్మేంద్రియముద్వారమున స్థూలేంద్రియాతీత పదార్థమును, జ్ఞానమును పొందగలశక్తి. దీనివలన మనము సూక్ష్మవస్తువుల జూడగలము, సూక్ష్మశబ్దమును వినగలము, సూక్ష్మవాసనను గ్రహించగలము, సూక్ష్మపదార్థముల తాకగలము, సూక్ష్మాహారమును ఆస్వాదించగలము. సూక్ష్మదృష్టియొక్క చరమపరిణామమే దివ్యదృష్టిని పొందుట. దీని ప్రభావమున దూరమున నున్నట్టియు, రహస్యమైనట్టియు, అన్యలోకగతమైనట్టియు నితరుల సంగతులు మనకు తెలియును. వ్యాసమహర్షి ఆ యోగశక్తిమహాప్రభావమున దివ్యదృష్టిని సంజయుని కియ్యగలిగి యుండెను. దీనిని నమ్మకుండుట కెట్టి కారణమునులేదు. పాశ్చాత్యయోగి (Hypnotist) యొక్క అద్భుత శక్తిని మనము నమ్మినచో, మహాజ్ఞాని యగువ్యాసుని శక్తిని గూర్చి అవిశ్వాసమేల? శక్తిమంతులు తమశక్తిని నితరులలో ప్రవేశపెట్టగలరు. ఇందుల కనేక ప్రమాణములు చరిత్రలోని ప్రతిపుటయందును, మానవ జీవితముయొక్క ప్రతికార్యమున కానవచ్చును. నెపోలియన్ మొదలగు కర్మవీరులు తాము యోగ్యులని తలంచిన మనుష్యులలో శక్తిని ప్రవేశింపజేసి, వారి ద్వారమున తమ కార్యముల నిర్వర్తింపజేసికొనిరి. సాధారణయోగి కూడ నేదోయొకసిద్ధిని బొంది కొంతకాలముగాని, ఒకకార్యము

నెరవేర్చుకోగలందులకు గాని ఇతరులకు తనశక్తి నీయగలడు. ఇక జగత్ప్రసిద్ధుడును, అసామాన్యయోగసిద్ధపురుషుడును నగు వ్యాసుని గూర్చి చెప్పవలెనా! నిజముగా దివ్యదృష్టి సంగతి బూటకము గాక, వైజ్ఞానికసత్యము. కన్నులు చూడజాల వనియు, చెవులు వినజాల వనియు, నాసిక ఆఘ్రాణించజాల దనియు, శరీరము స్పర్శమును పొంద జాల దనియు, జిహ్వ రుచిని చూడజాల దనియు, మనస్సే చూచుననియు, విననియు, ఆఘ్రాణించుననియు, స్పర్శమును పొందుననియు, ఆస్వాదించుననియు మన మెరుగుదుము. వేదాంత శాస్త్రమునను, మనోతత్త్వ శాస్త్రమునను, ఈ సత్యము చాలకాలమునుండి నమ్మబడుచున్నది. యోగనిద్ర (Hypnotism) కూడ వైజ్ఞానికప్రయోగద్వారమున పరీక్షింపబడి, కండ్లుమూసికొనినను, దర్శనేంద్రియము చేయుపని ఏనాడిద్వారముననైనను, పొందవచ్చునని రుజువుచేయబడినది. ఇందువల్ల చక్షురాదిస్థూలేంద్రియములు జ్ఞానప్రాప్తికి సుల భోపాయములని తేలుచున్నది. స్థూలశరీరముయొక్క అనాది అభ్యాసమువల్ల మనము వానికి దాసులమైతిమి. కనుక వాస్తవముగ అంధుడు స్పర్శవల్ల వస్తువులయొక్క ఆకృతిస్వభావ ములు పొరపాటు లేక, గ్రహించునట్లు శరీరముద్వారమున ఆజ్ఞానము మనస్సునకు కలుగుచున్నది. కాని స్వప్నావస్థ పొందినవానిదృష్టికిని, అంధునిదృష్టికిని భేదము గలదు. స్వప్నావస్థను బొందినవ్యక్తి మనోమధ్యను వస్తువుయొక్క ఆకృతిని జూచును. దీనినే దర్శనమందురు. వాస్తవమేమన, మనము

మనయెదుటనున్న వస్తువును చూచుటలేదు, కాని ఆవస్తువు యొక్క ఆకారము మనకండ్లలో చిత్రింపబడును. దానిని చూచి, ఆవస్తువును చూచినట్లు మనస్సు చెప్పును. కాని యోగనిద్రపొందినవాడు దూరముననున్న వస్తువును చూచుట గాని, శబ్దమును వినుటగాని జరిగినపుడు అటుల గ్రహించు టకు యెట్టి శారీరకపరిణాలికావశ్యకత లేదనియు, సూక్ష్మ దృష్టిద్వారమున చూడనగుననియు రుజువగుచున్నది. లం డను నగరమున స్వగృహములో కూర్చుండి ఎడింబరోలో ఆస మయమున జరుగుచున్న కార్యమును మనస్సులో చూచితి ననియు చెప్పుచుండు దృష్టాంతరములు దినదినము వృద్ధియగు చుండుట మనము చూచుచున్నాముగదా! దీనినే సూక్ష్మదృష్టి యందురు. సూక్ష్మదృష్టికిని దివ్యదృష్టికిని భేదమిది. సూక్ష్మ దర్శి కాన్పించని వస్తువులయొక్క ప్రతిమూర్తి మనస్సులో చూచును. దివ్యదృష్టిగలవాడు మనోమధ్యను చూడక కండ్ల తోనే చూచును. చింతాశ్రోత్రమున శబ్దమును వినక, కర్ణ ములద్వారముననే వినును. ఇందుకు (Crystal) లేక సులో చనములద్వారమున తాత్కాలికఘటనలు చూచుటయొక్క సామాన్యదృష్టాంతరము గలదు. కాని దివ్యదృష్టి ప్రాప్తించిన యోగి కెవ్విధమైనయుపకరణములఆవశ్యకము లేదు. అతడీశక్తి ద్వారమున నుపకరణ రహితముగనే దేశకాలబంధములను తెగ్గించికొని ఇతరదేశములసంగతులు గాని, యితరకాలపు విషయములు గాని, గ్రహించగలడు. దేశబంధవిమోచనపు పరిమాణమును మనము చూచుచున్నాము. కాలబంధనమును

కూడ అతడు దాటకలడు. మానవుడు త్రికాలదర్శి కాగలడు.
కాని బహుసంఖ్యాకమైన ఈ సంతోషకరదృష్టాంతము లింక
ను, నీపప్రపంచములో చూపబడి యుండలేదు. దేశబంధ
విమోచనము సంభవమైనపుడు కాలబంధవిమోచన, మసం
భవమనుటకు వీలులేదు. ఏది ఎటులున్నను వ్యాసదత్తమైన
దివ్యదృష్టిద్వారమున సంజయుడు హస్తినాపురమున నుండియే,
కురుక్షేత్రముననున్న పాండవ ధార్తరాష్ట్రులను కండ్లతో
చూచి, దుర్యోధనునిమాటలను, భీష్మపితామహుని సింహనా
దమును, పాంచజన్యముయొక్క కురుధ్వంసఘోషకమైన
మహాశబ్దమును గీతార్థద్యోతకమైన శ్రీకృష్ణార్జున సంవాద
మును చెవులతో వినెను.

మహాభారతము, రూపకము కాదనియు, శ్రీకృష్ణార్జు
నులు కవికల్పితులు గారనియు గీత ఆధునిక తార్కిక లేక
వేదాంతసిద్ధాంతము గాదనియు మా అభిప్రాయము. కనుకనే
గీతలోని యేవిషయమూ, అసంభవముగాని, యుక్తివిరుద్ధము
గాని, కాదని రుజువుచేయబడును. అందుచేత దివ్యచక్షుః
ప్రాప్తివిషయమై యింత దీర్ఘముగా విచారింపబడెను.

## దుర్యోధనునివాక్కౌశలము

దుర్యోధనుడు పాండవుల సైన్యవ్యూహమును చూచి
ద్రోణాచార్యులమెదుటకు వచ్చుట, యుద్ధరంగప్రథమకార్య
ముగా సంజయుడు చెప్పెను. ద్రోణునిదగ్గర కెందుకు వెళ్లెనో

తెలుపుటావశ్యకము. భీష్ముడు సేనాధిపతిగాన, యుద్ధసంగతులు భీష్మునికి చెప్పుట ఉచితము. కాని కపటబుద్ధిగల దుర్యోధనునికి భీష్మాచార్యునిపై విశ్వాసము లేదు. భీష్ముడు పాండవపక్ష పాతి, హస్తినాపురముననున్న శాంతిపక్షమునకు నాయకుడు. పాండవులకును, ధార్తరాష్ట్రులకును మాత్రమే యుద్ధము జరిగిన అత డెన్నడును అస్త్రధారణచేసెడివాడు కాడు. కాని కౌరవుల ప్రాచీనశత్రువును, ప్రతిస్పర్ధియునై సామ్రాజ్యాభిలాషియగు పాంచాలజాతిద్వారమున కురురాజ్యము ముట్టడింపబడుట చూచి, కౌరవజాతియొక్క ప్రధానపురుషుడు, యోధుడు, రాజనీతిజ్ఞుడు, సేనాధిపతిగా చేయబడి స్వీయ బాహుబలముచే, చిరకాలమునుండి రక్షింపబడుచున్న స్వజాతి గౌరవ ప్రాముఖ్యములను తుదిసారిగా కాపాడ సంకల్పించెను. దుర్యోధనుడు అసురస్వభావము గలవాడు. రాగద్వేషములే అతనికార్యము లన్నిటికిని ప్రమాణములు, కారణములు. కనుక కర్తవ్య పరాయణుడగు ఆమహాపురుషునియొక్క మనోభావమును అతడు గ్రహించజాలడు. స్వీయ కర్తవ్యము నెరవేర్పుటకై తనకు ప్రాణసమానులైన పాండవుల నైనను యుద్ధక్షేత్రమున సంహరింపగల బలము యీకఠినతపస్వికి కలదను సంగతి అత డెన్నడును విశ్వసింపజాలక పోయెను. స్వదేశహితాభిలాషి, తనజాతి అన్యాయమున ఆహితమున బడనున్నతటిని, ఆలోచనాసమయమందు అహితమునుండి కాపాడుటకు తనశక్తికొలది ప్రయత్నించియు చివరకు బహుజనాభిప్రాయముగనే గయికొని, అధర్మయుద్ధమున

గూడ స్వజాతిసంరక్షణకై ప్రవేశించును. భీష్ముడిట్టిమార్గ మునే అవలంబించెను. కాని ఈ భావము దుర్యోధనునికి దురవగాహము. కనుక భీష్మునియొద్దకు పోక ద్రోణాచార్యుని యొద్దకు వెళ్లెను. ద్రోణుడు వ్యక్తిగతముగా పాంచాలరాజునకు ఘోరశత్రువు. పాంచాలదేశరాజకుమారు డగు ధృష్టద్యు మ్నుడు, గురువగు ద్రోణుని వధించుటకు ప్రతిజ్ఞచేసెను. అందుచే నీవ్యక్తిగతవైరభావమును జ్ఞాపక మొనర్చిన, ఆచా ర్యుడు శాంతిపక్షపాతమును వీడి పూర్ణోత్సాహముతో యుద్ధమొనర్చునని తలచెను. కాని దుర్యోధనుడు స్పష్టముగా నీసంగతి చెప్పక ధృష్టద్యుమ్నుని పేరు మాత్రము పేర్కొనెను. అనంతరము భీష్ముని సంతోషపెట్టదలచి, ఆయనను కురురాజ్య రక్షకుడనియు, ఆయనయే విజయమున కాధారభూతుడనియు బల్కెను. మొట్టమొదట శత్రుపక్షములోని ముఖ్యయోధుల పేర్లను పేర్కొని, అనంతరము తనసైన్యములోని ముఖ్యుల పేర్లన్నిటిని చెప్పక కొందరిని మాత్రమే చెప్పెను. ఇందు లకు కారణము ఏమన భీష్మద్రోణుల నామముల పేర్కొను టయే అతని అభిప్రాయముకాని, ఆయభిప్రాయమును మరుగు పరచుటకు గాను మరి నాల్గైదు పేర్లు వచించెను. అనంతరము దుర్యోధనుడు "నాసైన్యము చాల యెక్కువగా నున్నది. భీష్ముడు నాసేనాధిపతి. పాండవసైన్యము మిక్కిలి స్వల్పము. అయినను వారు భీమునిపై ఆశనిడుకొని జయము పొందజూచు చున్నారు. కాన మన మేల జయింపజాలము? అయినను మన జయమున కాధారుడగు భీష్ముని శత్రువులు ముట్టడించకుండా,

అందరు చూచుటవసరము. ఆయన యున్న మనకు తప్పక జయము కలుగును" అని పల్కెను. అనేకులు "అపర్యాప్త" పదమునకు విపరీతార్థమును చెప్పుదురు. అది యుక్తసంగతిము కాదు. ఏలనన దుర్యోధనుని సేన మిగుల గొప్పది. అతని సేనలో ప్రధాననాయకులు శౌర్యధైర్యములలో నెవరికిని తీసిపోవు వారు కారు. ఇంతియెగాక ఆత్మశ్లాఘియగు దుర్యోధనుడు తన యొక్క బలమును నిందించుకొని ఏల నిరాశను పొందును? భీష్ముడు దుర్యోధనుని భావమును అతనిమాటలయొక్క గూఢోద్దేశమును గ్రహించి అతనిసందేహము పోగొట్టదలచి సింహనాదముచేసి శంఖము పూరించెను. అది విని దుర్యోధనుడు సంతసించెను. తన ఉద్దేశము నెరవేరినదనియు, భీష్మద్రోణులు సందేహము వీడి యుద్ధమొనర్తురనియు అతడు తలచెను.

## పూ ర్వ సూ చ న.

భీష్ముని అరిజనభేదిశంఖనాదముచే యుద్ధరంగము కంపితమయ్యెను. అపుడు విశాలకౌరవసేన దశదిశలనుండి రణవాద్యములను మ్రోగించెను. రథికు లందరు రణోల్లాసముచే సుద్రేకితులైరి. రెండవవైపున పాండవశ్రేష్ఠుడునగు అర్జునుడును, అతనిసారథియగు శ్రీకృష్ణుడును భీష్మునియుద్ధాహ్వానమునకు జవాబుగా శంఖనాదమొనర్చిరి. యుధిష్ఠిరుడును, తత్పక్షవీరులును తమ తమ శంఖములు పూరించి సైన్యహృదయములోని యుద్ధదేవతను మేల్కొల్పిరి. ఈమహాశబ్దము పృథివ్యాకా

శములను ధ్వనింపచేసి ధార్తరాష్ట్రులహృదయముల విదీర్ణ మొనర్చెను. దీని యర్థము భీష్ముడు మొదలయినవారీశబ్దముచే భయపడిరని కాదు. వారు వీరపురుషులు. రణచండియొక్క ఆహ్వానమునకు వారేల భీతిల్లెదరు? కవి మొట్టమొదటనే యీ మహాధ్వనియొక్క శారీరకసంచారమును వర్ణించెను. ఎవ్విధముగా పిడుగుశబ్దపుధ్వని అనేకుల దద్దరిల్ల చేయునో అటులనే యుద్ధరంగమంతటను యీశబ్దము వ్యాపించెను. ఇంతేగాక యీశబ్దము ధార్తరాష్ట్రుల భావిసంహారఘోషణమై యుండెను. పాండవులఅస్త్రములచే, విదీర్ణము గానున్న వారిహృదయములు ముందుగనే యీశబ్దముచే పగిలెను. యుద్ధమారంభ మయ్యెను. రెండువైపులనుండి శస్త్రప్రయోగము జరుగసాగెను. అట్టిసమయమున అర్జునుడు శ్రీకృష్ణునితో "దుర్బుద్ధిపరుడగు దుర్యోధనునికి ఎవ్వరు సాయపడవచ్చిరో, ఎవరితో నేను యుద్ధముచేయవలెనో చూచుటకు నారథమును ఉభయసైన్యములమధ్యకు పోనిమ్మ"ని చెప్పెను. అర్జునుని భావమిది: "నేనే పాండవులకు జయము చేగూర్చువాడను. నాచేతనే శత్రువర్గములోని ప్రధానయోధు లందరు చంపబడవలెను. కనుక వారెవరో నేను చూడవలసి యున్నది." అని ఇంతవరకు అర్జునునికి సంపూర్ణక్షత్రియస్వభావముగలదు. కృపగాని దౌర్బల్యసూచకమైన మరియొక చిహ్నముగాని లేదు. భరతఖండములోని అనేకయోధశ్రేష్ఠులు శత్రుపక్షములో నుండిరి. వారినందరిని సంహరించి తన అన్నయగు ధర్మరాజునకు అసమానసామ్రాజ్యము నియ్య సిద్ధముగా నుండెను.

కాని శ్రీకృష్ణుడు అర్జునునికి హృదయదౌర్బల్యము గల దనియు యిప్పు డది నివారణకానియెడల యెప్పుడో ఒకప్పు డది ఆకస్మికముగా చిత్తమునుండి బుద్ధిలో ప్రవేశించి పాండవులకు నష్టమేగాక వారిని నాశనముచేయునని యెఱుగును. అందుచేతనే అర్జునునికి ప్రియులైన భీష్మ ద్రోణులు మొదలైనవారిని, కౌరవసైన్యములోని సకలరాజన్యులను చూడ గలుగునట్టిస్థానమున రథమునుంచి "కూడియున్న కురుజాతిని చూడు" మనెను. అటుల పలుకుటలో అర్జునునకు తాను కురుజాతీయుడనని తోచినది. కురువంశపుగౌరవము పొడగట్టినది. ఇంతియకాదు. వారందరు తన ఆత్మీయులును, ప్రియులును, బాల్యసహచరులునగుకురుజాతీయులే అనియు మనోగతమైనది. ఈ మూడుభావములును అతనికి తోచునట్లు శ్రీకృష్ణునినోట గంభీరారవమున వెలువడెను. అపు డర్జునుని, కెవ్వరినిసంహరించి యుధిష్ఠిరునికి శత్రురహితసామ్రాజ్యమియ్యదలచెనో వారందరు స్వీయబంధువులును, గురువులును, ప్రేమాస్పదులుతప్ప నితరులెవ్వరు కారని తెలిసెను. భరతఖండములోని పరస్పరసంబంధముగల క్షత్రియులెల్లరు ఒండొరులను వధించుటకొఱకే రణరంగమున సమావేశమై యుండుట అతడు చూచెను.

## విషాదమునకు మూలకారణము.

అర్జునునిని ర్వేదమునకు మూలమెద్ది? అనేకు లీవిషాదమును పరిశంసించి శ్రీకృష్ణుడు కుమార్గదర్శకుడనియు, అధ

ర్మామోదకుడనియు నిందింతురు. క్రైస్తవమతములోని శాంతభావము, బౌద్ధమతములోని అహింసాభావము, వైష్ణవ మతములోని ప్రేమభావము, శ్రేష్ఠములనియు, యుద్ధము నరహత్యా పాపమనియు భ్రాతృహత్య, గురుహత్య మహాపాప మనియు తలచి వారు ఏతత్ భావవశానువర్తులై ఈ అసంగ తమును బల్కుదురు. ఈ ఆధునిక భావము లన్నియు, ద్వాపర యుగముననున్న మహావీరులైన పాండవులమనస్సులలో కలుగ లేదు.అహింసా, యుద్ధము వీనిలో ఏది శ్రేష్ఠమైనది ? నరహత్య భ్రాతృహత్య, గురుహత్య, పాపమని తలచి, యుద్ధము మాని వేయు టుచితమను భావముయొక్క చిహ్నములు అర్జునుని మాటలలో లేవు. గురుజనుల వధించుటకంటె భిక్షాన్నముచే జీవించుటైన శ్రేయస్కరమని చెప్పినది సత్యమే. బంధువులను వధించుటచే పాపము మనలను పొందునని చెప్పినదియుసత్యమే. కాని అర్జునుడు కర్మస్వభావమును చూచిగాక కర్మయొక్క ఫలి తమును చూచి ఈ సంగతులు చెప్పెను. కనుక శ్రీకృష్ణుడు అతని విషాదమును పోగొట్టదలచి కర్మయొక్క ఫలితము చూడగూడదనియు, కర్మస్వభావమును జూచి, కర్మచేయు టుచితమా? లేదా? యని స్థిరపరచుకొనవలసినదనియు, బోధిం చెను. అర్జునునియొక్క ప్రథమభావము వారందఱు ఆత్మీయు లును, గురువులు, బంధువులు, బాల్యసఖులు, ప్రేమపాత్రులు ననియు, వారిని వధించుటచే అసపత్నరాజ్యము సంభవించినను ఆరాజ్యము సుఖభోగమైనదిగాక, దుఃఖకరమైనదనియు, జీవిత పర్యంతము పశ్చాత్తాపమువలన దగ్ధము కావలసి యుండు

ననియు, బంధుశూన్యమైన రాజ్యము కోరదగినది కాదనియు నైయుండెను. ప్రేమాస్పదులైన వారిని వధించుట ధర్మవిరుద్ధ మనియు, ద్వేషులైనవారిని యుద్ధమునందు వధించుట క్షత్రి యునిధర్మ మనియు, అతని ద్వితీయభావము. స్వార్థము కొఱ కట్టి కర్మమొనర్చుట ధర్మవిరుద్ధమనియు, క్షత్రియులకు తగి నది కాదనియు అతని తృతీయ భావము. భ్రాతృవిరోధము భ్రాతృహత్యలవలన కులనాశనము జాతిధ్వంసముకలుగుననియు నిట్టి ఫలితములు కలుగచేయుకార్యముల నొనర్చుట క్షత్రియు నకు మహాపాపమనియు అతనిచతుర్థభావము. ఈ నాల్గుభావ ములుగాక అర్జునునివిషాదమునకు మరియొక భావ మేదియు లేదు. ఇది తెలిసికొనక పోయిన శ్రీకృష్ణుని యుద్దేశమును గాని, ఆతని బోధయొక్క అర్థమును గాని తెలిసికొన జాలరు. క్రైస్తవమతము, బౌద్ధమతము వైష్ణమతములతో, గీతాధర్మము యొక్క విరోధ సామరస్యములు తరువాత చెప్పబడును. అర్జునుని వాక్యముయొక్క భావము సూక్ష్మ విచారము చేసి పరికటింతము.

## వైష్ణవమాయాపరివేశము

అర్జునుడు ప్రథమమున తనయొక్క విషాదమునుగూర్చి చెప్పెను. ప్రేమ కృపలు ఆకస్మికముగా అర్జునుని ఆవరించి స్వాధీన మొనర్చుకొని అతనిశరీరములోని బలమంతయు ఒక్క క్షణములో శుష్కింపజేసి, సమస్తావయవముల దుర్బల

మొనర్చెను. దృఢమైన అతని హస్తము గాండీవమునుగూడ పట్టజాలకపోయెను. దుఃఖముచే జ్వరలక్షణముగూడ గన్పట్టెను. నిలుచుండజాలకపోయెను. శరీరము దుర్బలమయ్యెను. నోరెండిపోయెను. శరీరమంతయు మిక్కిలిగా కంపమొందెను. మనస్సు చంచలమైపోయెను. ఈ భావవర్ణనగూర్చి చదివినపుడు మొట్టమొదట యిది కవికల్పనాచాతుర్యముగా తోచునుగాని, దీర్ఘముగా విచారించిన, యీవర్ణనలో ఒకగూఢార్థమున్నదని తోచును. అర్జునుడు కౌరవులతో యిదివరకు యుద్ధమొనర్చెను. కాని ఈభావ మతనికి యిదివర కెన్నడును గలుగలేదు. శ్రీకృష్ణునియొక్క వాక్కుచే నిపుడే అంతరంగ సంక్షోభము కలిగెను. మానవుని పరిబల వృత్తులు, క్షత్రియ శిక్షాదుల వలన నోడింపబడి నిలిచి, అర్జునుని హృదయములో గుప్త భావమున నుండెను. నిగ్రహద్వారమున చిత్తశుద్ధి గలుగదు. వివేకజ్ఞానములచే గల్గిన సంయమముచే చిత్తశుద్ధి గలుగును. నిగ్రహింపబడినభావములు కోర్కెలు నీజన్మమందుగాని, పర జన్మమందుగాని, యెప్పుడో యొకప్పుడు చిత్తమున అంకురించి, బుద్ధిని స్వాధీన మొనర్చుకొని సమస్తకార్యములను తనయిష్టమువచ్చినట్లు చేయించును. ఇందుచేతనే యీ జన్మలో దయాస్వభావము గలవాడు, రెండవజన్మములో కఠినహృదయుడగును. ఈ జన్మలో కామియై దుర్బుద్ధి గలవాడు. రెండవజన్మలో సాధుచరితుడగును. పవిత్రుడును, అగును. కనుక నిగ్రహించక, వివేకవిశుద్ధబుద్ధుల సహాయముచే, కోర్కెలనన్నిటిని త్రోసివేసి. చిత్తశుద్ధి కలుగ

జేసికొనవలెను. దీనినే సంయమమందురు. జ్ఞానప్రభావమున, తమోభావ మంతరించనియెడల సంయమము గల్గుట అసంభవము. ఇందుచేతనే, శ్రీకృష్ణుడు అర్జునునిఅజ్ఞానముబోగొట్టి నిద్రాణమైయున్నవివేకమును మేల్కొలిపి చిత్తశోధనచేయ సంకల్పించెను. కనుక పరిహార్యవృత్తులనన్నిటిని చిత్తమునుండి బేరేచి బుద్ధియెదుటపెట్టని యెడల బుద్ధి వానిని దూరీకృతమొనర్చుట కవకాశము చిక్కదు. ఇంతేగాక అంతరంగమున నున్న దైత్యదానవ పోరాటములో, వివేకద్వారమున హతమొనర్పబడినగాని, బుద్ధి ముక్తిని బొందజాలదు. యోగియొక్క ప్రథమదశయందు చెడువృత్తులన్నియు చిత్తమును బంధించి ప్రబల వేగమున బుద్ధిని స్వాధీనమొనర్చుకొని, అభ్యాసము లేని సాధకుని భీతునిగా జేయును. దీనినే పాశ్చాత్యులు సైతాననియు, మనము మాయయనియు పిలుచుచున్నాము. కాని ఆభీతి అజ్ఞానసంభూతము, ఆప్రలోభనము సైతానునిది కాదు; భగవానునిది. అంతర్యామియైయున్న జగద్గురువు, అశుభమునకు గాక శుభమునకే చిత్తశోధనకొఱకు ఆసకల ప్రవృత్తులను సాధకుని ముట్టడించుట కాహ్వానించును. శ్రీకృష్ణుడెటుల బాహ్యజగత్తులో శరీరధారియై అర్జునుని సఖుడును సారథియునగునో అటులనే యతనిలో శరీరగతమైన ఈశ్వరుడు,అంతర్యామియగు పురుషోత్తముడు. ఆయనయే ఈగు ప్రవృత్తులను, భావములను ప్రబలవేగమున ఒకేసమయమున బుద్ధిపై బురికొల్పెను. ఈభీషణాఘాతముచే బుద్ధి ఘూర్ణిల్లిమానసికవికారములు కల్గి వెంటనే స్థూలశరీరములో కవిచే వర్ణింపబడిన లక్షణము

లన్నియు గన్పట్టెను. ప్రబలమైన యిట్టిశోకదుఃఖములు శరీరమున యీవిధముగా వ్యక్తమగుట మన మెరుగుదుము. ఇది మానవులయొక్క సాధారణానుభవములోనిదే. భగవానుని వైష్ణవమాయ అఖండబలముతో ఒక్కక్షణములో అర్జునుని పరాజిత మొనర్చెను. అందుచేతనే యీప్రబలవికారము కలిగెను. ఎప్పుడు అధర్మము దయ ప్రేమ ప్రరూపముధరించి అజ్ఞానము జ్ఞానరూపముదాల్చి గాఢతమోగుణము పవిత్రతా భావము గాంచి "నేను సాత్వికుడను, జ్ఞానిని, ధర్మాత్ముడను భగవంతుని ప్రియమైన దూతను పుణ్యప్రవర్తకుడను" అని చెప్పునో అప్పుడు భగవంతునివైష్ణవమాయ బుద్ధియందు ప్రవేశించెనని గ్రహించవలెను.

## వైష్ణవమాయాలక్షణములు.

ఈవైష్ణవమాయయొక్క ముఖ్యాస్త్రములు, కృపా స్నేహములు, మానవజాతియొక్క ప్రేమానురాగములు, విశుద్ధవృత్తులు కావు. శారీరమందలియు ప్రాణకోశమునందలియు వికారములవల్ల పవిత్రమైన దయాప్రేమలు కలుషితములగును. చిత్తము వృత్తులకు వాసస్థానము. ప్రాణము భోగములకు నిలయము. శరీరము కర్మయొక్క యంత్రము. బుద్ధి చింతియొక్క రాజ్యము. విశుద్ధావస్థయందు నివన్నియు భిన్నములైనను పరస్పరము విరోధపడు ప్రవృత్తులు కావు. చిత్తమందు భావ ముదయించి శరీరముద్వారమున తదనుసారమైన కర్మ జరుగును.

బుద్ధియందు తత్సంబంధమైనచింత కలుగును. ప్రాణము ఆభావ కర్మచింతలయొక్క ఆనందమును భోగించును. జీవి సాక్షియై ప్రకృతియొక్క ఆనందమయక్రీడాదర్శనమువలన ఆనందము పొందును. అశుద్ధావస్థయందు ప్రాణము శారీరక లేక మానసిక భోగములు పొందగోరి, శరీరమును కర్మయంత్రముగా నుపయోగించక భోగముకొరకునుపయోగించును. అందుచేచిత్తము శారీరకభోగేచ్ఛలం దాక్రాంతమై నిర్మలభావము గ్రహించుటకు శక్తిలేక కలుషితవాసనాయుక్తభావములు ప్రవేశపెట్టుకొనును. ఆవాసనాకోలాహలము బుద్ధిని మోడించి వివృతమొనరించి ప్రాణమునకు బధిరతగలుగజేయును. బుద్ధి నిర్మల శాంతభావములు గ్రహించలేక చంచలమైన మనస్సుకు స్వాధీనమై భ్రమలోబడి అనృతప్రాబల్యముచే గుడ్డిదై పోవును. జీవాత్మకూడ యీబుద్ధిభ్రంశముచే జ్ఞానమును పోగొట్టికొనుటచే సహజసాక్షిభావమును నిర్మలానంద భావమును గోల్పోయి, ఆధారములతో తనఏకత్వమును స్వీకరించి "నేను దేహమును, నేను ప్రాణమును, నేను చిత్తమును, నేను బుద్ధిని." అని యీ భ్రాంతియందు బడి శరీరమానసికసుఖదుఃఖములందు సుఖదుఃఖములను పొందును. అశుద్ధచిత్తమే ఈ భ్రమకు మూలము. కనుక చిత్తశుద్ధియే యున్నతికి ప్రథమసోపానము. ఈ అశుద్ధత, తామసిక రాజసవృత్తులనుమాత్రమే కలుషమొనర్చి తృప్తిపొందక సాత్వికవృత్తినికూడ కలుషితమొనర్చును. "ఫలానామనుష్యుడు నా శారీరక, మానసిక భోగాశ్రయుడు. వాడే కావలయును.

వానియొక్క యెడబాటుచే నాకు కష్టము కలుగును" అనుట అపవిత్రప్రేమ. శరీర ప్రాణములు చిత్తమును, కలుషిత మొనర్చి నిర్మలప్రేమను వికృతమొనర్చును. బుద్ధికూడ యీ అశుద్ధఫలితమున భ్రాంతిని పొంది "ఫలానావారు నా భార్య, నాసోదరుడు, సోదరి, సఖుడు, ఆత్మీయుడు. వారిని ప్రేమించ వలయును. అటుల చేయుటపుణ్యము, ఆప్రేమకు ప్రతికూలకార్య ముల నొనర్చుట పాపము, అధర్మము." అనును. ఈ విధముగా అశుద్ధప్రేమఫలితమున బలవత్తరమైన కృప గలిగి ప్రియులను కష్టపెట్టుట, వారికి అరిష్టములచేయుటకంటె, ధర్మమును వీడు టయే శ్రేయస్కరముగాదోచి, ఆఖరుకు యీకృపకు యెక్కడ భంగము కల్గునో అని అధర్మమును, ధర్మముగా తలచి, తన దౌర్బల్యమునే సమర్థించుకొనును. ఇట్టి వైష్ణవమాయ అర్జునుని ప్రతివాక్యమందున మనము చూడనగును.

## వైష్ణవమాయయొక్క తీవ్రత్వము.

అర్జునుని ప్రథమవాక్యమిది "వీరు నాకు స్వజనులు, ఆత్మీ యులు, ప్రేమమాస్పదులు. వీరిని యుద్ధమందు వధించుటచే నా కేట్టిహితము కలుగును? విజేతకుగలగర్వమా? రాజునకున్న గౌరవమా? ధనమువలని సుఖమా? ఏది గల దిందువలన? నే నీపనికిమాలినస్వార్థములు కోరను. ప్రజలకు రాజ్యమందు, భోగములందు, జీవితమున ప్రియ మేల గల్గుచున్నది? భార్యా పుత్రులు గలరని, ఆత్మీయస్వజనులకు సుఖము చేకూర్పగల వని, బంధువులు, ఐశ్వర్యముతో సుఖముగా నుండగా సంతో

షముతో దినములు గడుపగలమని తలచుటచే సుఖములు కలుగుచున్నవి. ఈసుఖము లన్ని మిక్కిలి కోరదగిన విషయ ములు. కాని, యెవరికొఱకు నేను రాజ్యమును, భోగమును, సుఖమును, గోరుచున్నానో వారు నాకు శతృవులై యుద్ధ రంగమున జేరి యున్నారు. వారు నన్ను వధించినను మంచిదే కాని, వారిని వధించి నేను రాజ్యమును, సుఖమును, ఒంటరిగా బొందుట కిచ్ఛగింపను. వారిని వధించుటచే, త్రిలోకరాజ్యా ధికారము వచ్చినను, నా కిష్టములేదు. ఇక ఈభూలోకరాజ్యము సంగతి యేల?

"స్థూలదర్శులు."

"నకాంక్షే విజయం కృష్ణ, నచరాజ్యం సుఖానిచ"

మరియు,

"ఏతాన్నహన్తు మిచ్ఛామి, ఘ్నతోపి మధుసూదన,
అపిత్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే."

ఈ మాటలతో మోహితులై యిటుల పల్కుదురు. ఆహా! అర్జునునిభావము లెంత ప్రేమమయ నిస్వార్థోదార ములు. రక్తముతోగూడిన భోగసుఖములకంటె, అపజయ మరణములే కోరదగినవి. కాని అర్జునుని మనోభావము పరీ క్షించినయెడల, అతనిభావము క్షుద్రమైనదనియు, దౌర్బల్య సూచకమైనదనియు, క్లీబోచితమనియు, గ్రహించనగును. కులక్షేమముకొఱకుగాని, ప్రేమాస్పదులపైని ప్రేమకొఱకు గాని, కృపావశుడై రక్తపాతభయమున, వ్యక్తిగతస్వార్థత్యాగి

మొనర్చుట, అనార్యులపక్షమున గొప్ప యుదారభావము. ఆర్యులవిషయములో అది మధ్యమభావము. ధర్మముకొఱకు, భగవత్ప్రీతికొఱకునైన స్వార్థత్యాగము ఉత్తమభావము. మరియొకపక్షమున కులక్షేమముకొఱకు ప్రియులపై నిప్రేమ కొఱకు, కృపావశుడై రక్తపాతభయముచే ధర్మమును విడనాడుట అధమభావము. ధర్మముకొఱకు భగవత్ప్రీత్యర్థము స్నేహకృపాభయముల నడంచుట యథార్థమైన ఆర్యభావము. ఈ క్షుద్రభావసమర్థనార్థము, అర్జునుడు స్వజనహత్య పాపముగా కన్పఱచి యిటుల పల్కెను. "ధార్తరాష్ట్రుల చంపినందున నేమిసుఖము కలుగును? ఎటుల మనస్సంతుష్టి కాగలదు? వారు నాబంధువులు, ఆత్మీయులు. వారు నా కన్యాయమొనర్చినను, నాతో విరోధము పెట్టుకొనినను, రాజ్యము అపహరించినను, నేమిచేసినను, వారిని వధించుటచే నాకు పాపమే కల్గునుగాని, సుఖము కలుగదు." అర్జునుడు తాను ధర్మయుద్ధమొనరించుచుండుట మఱచెను. స్వీయసుఖముకొఱకుగాని, యుధిష్ఠిరునికొఱకుగాని, శ్రీకృష్ణునిద్వారమున ధార్తరాష్ట్రవధార్థము తాను నియమించబడలేదు. ధర్మస్థాపన, అధర్మనాశనము, క్షత్రియధర్మపాలనము, భరతఖండమున ధర్మప్రతిష్ఠితమైన ఒక గొప్ప సామ్రాజ్యము నెలకొల్పుట, యీ యుద్ధముయొక్క యుద్దేశములు. సమస్తసుఖములను విడనాడి, జీవితపర్యంతము దుఃఖముల ననుభవించియైనను యీ యుద్దేశమును సాఫల్యమొనర్చుట అర్జునునికర్తవ్యము.

## కు ల నా శ న వి ష య ము.

స్వీయదౌర్బల్యముసమర్థించుటకొఱకర్జును డీయుద్ధమున
కులనాశనము, జాతినాశనము, కల్గునుగాన నిది ధర్మముగాక
అధర్మ మను ఒక గొప్ప యుక్తిని కనుగొనెను. ఈ భ్రాతృ
హత్యయే మిత్రద్రోహము; మిత్రద్రోహమనగా స్వభావసిద్ధముగా
అనుకూలురును, సహాయులునైనవారికి నష్టముచేయుట. ఇంతే
గాక రెండుపక్షములకు, ఆదియైన కురువంశమునకు నాశనము
కలుగును. ప్రాచీనకాలమున జాతి సాధారణముగా రక్తస్పర్శచే
నేర్పడెడిది. ఒకకులము పెద్దదైనప్పుడు అదేజాతిగా పరిగణింప
బడెడిది. ఇటులనే భోజవంశము, కురువంశము మొదలగు భారత
జాతియొక్క అంతర్గతకులము లొక్కొక్క జాతిగా తర్వాత నేర్ప
డెను. కులములోని పరస్పరవిరోధమును, అర్జునుడు మిత్ర
ద్రోహముగా పేర్కొనెను. ఈవిధముగా నిది మిత్రద్రో
హము, నైతికముగా నిది మహాపాపము. ఆర్థికముగాగూడ నిది
మహాదోషావహము. ఇందుచే కులక్షయము తప్పక కలుగును.
సనాతనకులధర్మమును సరిగా పాలించుటచే, పూర్వీకులచే
స్థాపింపబడిన మహాదర్శములును, కర్మశృంఖలమగు గార్హస్థ్య
జీవనమును, రాజనీతిక్షేత్రమున రక్షింపబడి కులము ఉన్నతిని
బొందుచున్నది. ఆ ఆదర్శమునకు హానిగాని గార్హస్థ్యజీవన
మునకు శిథిలతగాని, సంభవించినచో కులము అధఃపతన
మగును. కుల మెంతకాలము సౌభాగ్యముగలదై బలిష్ఠమై
యుండునో, అంతవరకు నీ ఆదర్శకర్మశృంఖలములు రక్షింప
బడును. కులక్షీణదౌర్బల్యమువలన తమోభావ ముదయింప

జేసి, ఆదర్శములను గార్హస్థ్యమును శిథిలమొనర్చును. అందుచే అరాజకము, దుర్నీతి మొదలగు దోషములు కులమునందుకల్గి, ఉత్తమకులస్త్రీలు చెడి, నీచజాతీయులవలనను, నీచచరిత్రుల వలనను, సంతానమును గాంతురు. అందుచే వర్ణసంకర మేర్పడును. పితరులన్యాయసంతతి విచ్ఛేద మొనర్చిన కులహంతకులకు నరకప్రాప్తి కలుగును. అధర్మాభివృద్ధి, వర్ణసంకరము, నైతిక పతనము, నీచగుణాభివృద్ధి, అరాజకత, మొదలగు దోషములచే, కులమంతయు నాశనమై, నరకప్రాప్తి కలుగును. కుల నాశనముచే జాతికులధర్మములు నశించును. జాతిధర్మమన నేమి ? కులములన్నిటిసమిష్టిచే జాతి యేర్పడును. ఆ జాతి పురుషులచే పరంపరగా వచ్చుచున్న సనాతన ఆదర్శములును, కర్మశృంఖలములును జాతిధర్మములు నాబడు. అర్జునుడు తన ప్రథమసిద్ధాంతమును కర్తవ్య కర్మవిషయిక నిశ్చయమును తెలియజేసి, యుద్ధసమయమున గాండీవమును విడచి, రథము మీద కూర్చుండెను. దుఃఖముచే అతనిబుద్ధి కలత నొంది యివ్విధముగా క్షత్రియున కనుచితమైనదియు, అనార్యాచరణమునకు సంకల్పించెననియు, ప్రథమాధ్యాయములోని కడపటి శ్లోకమున కవి తెలియపఱచెను.

## విద్య — అవిద్య.

మనము అర్జునుడు చెప్పిన కులనాశనవిషయములో ఒక గొప్ప భావముయొక్క ఛాయను చూడనగును. ఈ భావముతో సంబంధించిన యే గురుతరప్రశ్న కూడి యున్నదో

అది గీతావ్యాఖ్యానకర్తకు చాల అవసరము. కాని కేవలము మనము గీతయొక్క ఆధ్యాత్మికార్థముమాత్రమే అన్వేషించి, మనజాతీయ, గార్హస్త్య, వ్యక్తిగతాదర్శకర్మములనుండి గీతోక్తధర్మమును సంపూర్ణముగా విచ్ఛేదమొనర్చి ఆభావమును, ఆప్రశ్నయొక్క మహత్త్వమును, ప్రయోజనమును త్రోసివేసి, గీతాధర్మముయొక్క సర్వవ్యాపకాభివృద్ధిని సంకుచిత మొనర్తుము. గీతావ్యాఖ్యానకర్తలగు శంకరప్రభృతులు, సంసారవిముఖులైన వేదాంతవిద్యాపరాయణులగు జ్ఞానులైగాని, భక్తులైగాని యుండిరి. వారు గీతలో వారికి కావలసిన జ్ఞానమును, భావమును, తీసికొని సంతుష్టులైరి. ఎవరు ఒకే సమయమున జ్ఞాని భక్తుడు కర్మయోగి అగునో వాడే గీతయందు, గూఢతమవిద్యాధికారి. గీత చెప్పిన శ్రీకృష్ణుడు జ్ఞానియు కర్మయోగియునై యుండెను. గీతాపాత్రుడగు అర్జునుడు భక్తుడును, కర్మయోగియునై యుండెను. వాని జ్ఞానచక్షువు తెఱచునిమిత్తమై కురుక్షేత్రమున శ్రీకృష్ణుడు ఈవిద్యను గఱపెను. రాజకీయసంఘర్షణమే గీతాబోధకు కారణము. ఆసంఘర్షణములో అర్జునుని రాజకీయోద్దేశసాఫల్యముకొఱకు యంత్రముగను, నిమిత్తమాత్రముగను యుద్ధమునందు ప్రవృత్తమొనర్చుటయే గీతోద్దేశము. కనుక యుద్ధక్షేత్రమే బోధకు సరియైన స్థలము. శ్రీకృష్ణుడు గొప్ప రాజనీతికోవిదుడు, యోధుడును. ధర్మరాజ్యస్థాపనయే ఆయన జీవితప్రధానోద్దేశము. అర్జునుడు క్షత్రియుడు. రాజనీతియు, యుద్ధము అతనిస్వభావనియతకర్మలు. గీతోద్దేశము, గీత

చెప్పిన కృష్ణుని, వినిన అర్జునుని, గీతాప్రచార కారణము లను తోసివేసి గీతావ్యాఖ్యాన మొనర్చిన ప్రయోజనమేమి?

ప్రపంచములో చిరకాలమునుండి వ్యక్తి కుటుంబము వంశము జాతి మానవసంఘము లను ముఖ్యమైన అయిదు వ్యవస్థలు గలవు. ఈఅయిదింటిపైన ధర్మము ప్రతిష్ఠింపబడెను. ధర్మముయొక్కలక్ష్యము భగవత్ప్రాప్తి. భగవంతుని పొందు టకు విద్య, అవిద్య, యను రెండు మార్గములు గలవు. ఈ రెండును ఆత్మజ్ఞాన, భగవద్దర్శనోపాయములే. బ్రహ్మచే సృజింపబడిన అవిద్యామయప్రపంచమును వీడి, సచ్చిదానంద మును పొందుట విద్యామార్గము. సర్వత్ర ఆత్మను, భగవంతుని దర్శించి, జ్ఞానమయ మంగళమయ శక్తిమయ పరమేశ్వరుని, బంధు, ప్రభు, గురు, పిత, మాత, పుత్ర, కన్య, దాస, సతి, పత్ని, రూపములవలన పొందుటయే అవిద్యామార్గము. విద్య యొక్క లక్ష్యము శాంతి. అవిద్యయొక్క లక్ష్యము ప్రేమ. కాని భగవంతునిప్రకృతి విద్యాఽవిద్యామయము. మనము కేవ లము విద్యామార్గము ననుసరించిన విద్యామయబ్రహ్మమును పొందుదుము. అవిద్యామార్గము ననుసరించిన అవిద్యామయ బ్రహ్మమును పొందుదుము. విద్యాఽవిద్యల రెంటిని నెవడు స్వాధీన మొనర్చుకొనగలడో, వాడే సంపూర్ణభావమున వాసుదేవుని పొందును. అతడు విద్యాఽవిద్యల కతీతుడు. ఎవడు విద్యయొక్క శేషలక్ష్యమువరకు చేరునో అతడు విద్యాసహాయ మున అవిద్యను ఆయత్త మొనర్చుకొనును. ఈశోపనిషత్తులో యీ మహాసత్యము ఈ క్రిందివిధముగా స్పష్టీకరించబడెను.

"అంధం తమః ప్రవిశంతి యేఽ విద్యాముపాసతే,
తతో భూయఇవ తే తమో య ఉ విద్యాయాంరతాః.

అన్యదేవాహు ర్విద్యయాఽన్యదేవాహురవిద్యయా,
ఇతి శుశ్రుమధీరాణాం యే నస్తద్విచచక్షిరే.

విద్యాంచావిద్యాం చ యస్తద్వేదోభయం సహ
అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే."

"ఎవరు అవిద్యోపాసకులో, వారు అంధాజ్ఞానరూప తమోమధ్యమును ప్రవేశించుచున్నారు. ధీరులైనజ్ఞానులు, ఎవరు మాకు బ్రహ్మజ్ఞాన మొనర్చిరో వారివల్ల విద్యకును ఫలముగలదనియు, అవిద్యకును ఫలము గలదనియు, ఆరెండు ఫలములు భిన్నము లనియు వింటిమి. ఎవరు విద్యాఽవిద్యలు రెంటిని జ్ఞానముచే సంపాదించిరో, వారు అవిద్యాద్వారమున మృత్యువును అతిక్రమించి, విద్యాద్వారమున అమృతమయ పురుషోత్తమునియొక్క ఆనందము ననుభవింతురు."

మానవజాతియంతయు అవిద్య ననుభవించి, విద్యా మార్గమువైపునకు నడుచుచున్నది. ఇది ప్రకృతిసిద్ధమైన క్రమవికాసము. ఎవ్వారు శ్రేష్ఠులు, సాధకులు, యోగులు, జ్ఞానులు, భక్తులు, కర్మయోగులు నగుదురో వారందరు ఈ యుద్ధయాత్రలో అగ్రసైనికులు. వారందరు దీర్ఘమైన యోగమ్యస్థానమును మహావేగమున పొంది, తిరిగివచ్చి మానవ జాతికి ఈ శుభసందేశమును వినిపించి, మార్గము చూపించి, శక్తి కలిగింతురు. భగవంతుని అవతారములు, విభూతులు

మార్గమును సుగమమొనర్చి, అనుకూలావస్థ కల్పించి, కష్టము లను తొలగించును. అవిద్యయందు విద్య, భోగమునందు త్యాగము, సంసారమున సన్న్యాసము, ఆత్మయందు సర్వభూతములు, సర్వభూతములలో ఆత్మ, భగవంతునిలో జగత్తు, జగత్తులో భగవంతుడు, ఈడుపలబ్ధియే సరియైన జ్ఞానము. ఇదియే మానవజాతిని గమ్యస్థానము జేర్చు నిర్దిష్టమైనమార్గము. ఆత్మ జ్ఞానముయొక్క సంకీర్ణత ఉన్నతికి ప్రధానాంతరాయము. దేహమే ఆత్మయని తలచుట, స్వార్థముగోరుట, ఈసంకీర్ణతకు మూలకారణములు. కనుక నితరులను తనవలె జూచుటయే అభివృద్ధికి ప్రథమసోపానము. మానవుడు మొదట వ్యక్తిభావము దాల్చి తనవ్యక్తిగతశారీరక,మానసికోన్నతియందును, భోగ సుఖములందు నాసక్తుడై యుండును. నేను దేహమును, మనస్సును, ప్రాణమును, అని తలచి, దేహముయొక్క బలము, సుఖము, సౌందర్యము, భోగలాలసత, జీవితోద్దేశములుగను, అవియే గమ్యస్థానములుగను తలచును. ఇది మానవుని ప్రథమావస్థ, లేక ఆసురజ్ఞానము. ఇందువల్లకూడ ప్రయోజనము గలదు. దేహమనోప్రాణముల ప్రథమమున అభివృద్ధిపొందించుకొని తరువాత పరోపకార మొనర్చుట ఉచితము. కనుక ఆసురశక్తి నభివృద్ధిపరచుట మానవజాతినాగరికతయొక్క ప్రథమావస్థ. పశువులు, యక్షరాక్షసులు, అసురపిశాచములు కూడ మానవులమనస్సులలో, కర్మలలో, చరిత్రలలో లీల యొనర్చి అభివృద్ధిపొందును. అనంతరము మానవుడు, ఆత్మజ్ఞాన మభివృద్ధిపరచుకొని ఇతరులను తనవలె చూచుకొనుట

కారంభించును. ఇతరులకొఱకు స్వార్థత్యాగ మొనర్చుట నేర్చు కొనును. మొదట కుటుంబమును తనవలె చూచుకొని భార్యా పుత్రాదులప్రాణరక్షణకొరకు, స్వీయసుఖమును గూడ విడ నాడును. ప్రాణమునైనను త్యాగమొనర్చును. అనంతరము వంశమునుగాని, కులమునుగాని, తనవలె చూచి కులరక్షణకై ప్రాణత్యాగ మొనర్చును. కులముయొక్క సుఖగౌరవాభివృద్ధి కొఱకు, తనయొక్కయు, భార్యాపుత్రాదులయొక్కయు, సుఖములను విడనాడును. అటుతరువాత జాతిని తనవలెనె జూచి జాతిరక్షణకై చిత్తూరురాజపుత్రు లందరు రాజపుత్రజాతి రక్షణార్థము, అనేకసార్లు ఎటుల బలియైరో, అటులనే జాతి రక్షణకును, సుఖగౌరవాభివృద్ధులకొఱకును, తనయొక్కయు తన భార్యాపుత్రాదులయొక్కయు, ప్రాణములను, కుల మును బలిదాన మొనర్చును. తదుపరి మానవజాతి నంతను తనవలెనె భావించి, మానవజాతిఉన్నతికై తన ప్రాణము లను త్యాగ మొనర్చి, తన భార్యాపుత్రాదులను, కులమును, జాతిని, బలియొనర్చి, మానవజాతియొక్క సుఖోన్నతుల కొఱకు తనయొక్కయు, భార్యాపుత్రాదులయొక్కయు, కులముయొక్కయు, జాతియొక్కయు సుఖగౌరవములను వీడును. ఇవ్విధమున నితరుని తనవలె చూచుట బౌద్ధమతము యొక్కయు బౌద్ధమతమునం దుద్భవించిన క్రైస్తవమతము యొక్కయు ప్రధానబోధయై యున్నది.

ఐరోపాఖండమున నైతికోన్నతి యీ మార్గమున అభి వృద్ధి పొందుచున్నది. ప్రాచీనపాశ్చాత్యులు, వ్యక్తిని

కుటుంబములోను, కుటుంబమును కులములోను లీనమొనర్చుట నేర్చుకొనిరి. ఆధునిక ఐరోపావాసులు కులమును జాతిలో లీన మొనర్చుట నేర్చుకొనిరి. జాతిని మానవసంఘములో లీన మొనర్చుట నేటికికూడ వారికి కఠినాదర్శముగా కన్పడు చున్నది. "టాల్‌స్టాయి" మొదలగు మనీషావంతులును, సామ్య వాదులును (Socialists) ఎట్టి ప్రభుత్వము అక్కరలేదని తల చెడివారును (Anarchists) మొదలగు నూతనాదర్శాను మోదకులు ఈఆదర్శమును ఆచరణలో పెట్టుట కుత్సాహులై యున్నారు. ఇంతవరకు మాత్రమే ఐరోపావాసులు గ్రహించ గల్గియుండిరి. వీరు అవిద్యోపాసకులు. వీరసలు విద్యను యింకను గ్రహించనే లేదు. "అంధంతమః ప్రవిశంతి యేఽవిద్యా ముపాసతే" భరతఖండమునందలి విద్వాంసులు, విద్యాఽవిద్యల రెంటిని ఆయత్త మొనర్చుకొనిరి. అవిద్యయొక్క పంచప్రతి ష్ఠలేగాక విద్యాప్రతిష్ఠయగు భగవంతు డొక డున్నాడనియు, ఆయనను తెలిసికొనలేకపోయిన అవిద్యకూడ తెలియదనియు పొందజాలదనియు వారెఱుగుదురు. కనుక కేవలము యిత రుల తనవలె జూడక "ఆత్మవత్ పరదేహేషు" అనగా తనలోను యితరులలోను సమభావమున భగవానుని దర్శించిరి. తాను అభివృద్ధినొందుట స్వీయాభివృద్ధిచే కుటుంబాభివృద్ధి, కుటుంబాభివృద్ధిచే కులాభివృద్ధి, అందుచే జాత్యభివృద్ధి, జాత్యభి వృద్ధిచే మానవసంఘాభివృద్ధియు నగును. ఈజ్ఞానము, ఆర్య సాంఘికవ్యవస్థయందును, ఆర్యవిద్యయందును గర్భితమై యున్నది. కుటుంబముకొఱకు, కులముకొఱకు, జాతికొఱకు,

మానవసంఘముకొఱకు, ఈశ్వరునికొఱకును, వ్యక్తిగతత్యాగ మొనర్చుట ఆర్యులమజ్జాగతాభ్యాసమై యున్నది. మనవిద్యలో ఏదోషము లేక, న్యూనత చూపింపబడుచున్నదో అది ఐతిహాసికకారణముల ననుసరించి కల్గినఫలితమైయున్నది. కాని అసలు విద్యలో లోటులేదు. అదేదన ఏవిధముగా వ్యక్తిని సంఘము కొఱకు, సంఘమును జాతికొఱకు వీడుదుమో, అటులనే రాజకీయాభివృద్ధికొఱకు త్యాగమొనర్చుట మనవిద్యలో అంతర్గత ముఖ్యాంగముగా గ్రహింపబడలేదనియు, పాశ్చాత్యులనుండి దానిని మనము గ్రహింపవలెననియు కొందరందురు. కాని మనప్రాచీనవిద్య, మహాభారతము, గీత, రాజపుత్రస్థానచరిత్రము, రామదాసుయొక్క దాసబోధ వీనియందిది కలదు. ఈవిద్య మనదేశములో నుండెను. అతిరిక్తవిద్యోపాసనవలనను అవిద్యాభయమువలనను ఈవిద్య అభివృద్ధినొందలేదు. ఆదోషముచే తమోభూతులమైజాతిధర్మచ్యుతులమై కఠినదాసత్వము, దుఃఖము, అజ్ఞానము మున్నగువానియందు పడి, అవిద్యను సంపాదించలేకపోతిమి; విద్యను పోగొట్టుకొంటిమి. "తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః".

## శ్రీ కృ ష్ణు ని రా జ కీ యో ద్దే శ ము.

కులము జాతి మానవసంఘవికాసమునకు భిన్నమైనవి. పూర్వకాలమున మనదేశమునగాని యితరదేశములలోగాని, ఈ భిన్నత్వము వృద్ధిపొందలేదు. కొన్నికొన్ని గొప్పకులముల సమ్మేళనముచే జాతి యేర్పడుచుండెను. ఈ భిన్నభిన్నకుల

ములు మొదట ఒక పూర్వపురుషునికి జెందిన వంశజు లగుటచే గాక, సమానమర్యాదలు గల భిన్నవంశజులైనను, ప్రేమ సంస్థాపనవల్ల ఒకేవంశజులుగా తలపబడెడివారు. భరతవర్షమంతయు ఒకగొప్పజాతి కాలేదు గాని దేశమంతటను వ్యాపించిన పెద్దజాతులలో ఒకేనాగరకత,ఒకేధర్మము, ఒకేసంస్కృతభాష, పరస్పరవివాహాదులసంబంధము కలిగియుండెడివి. ఐనను పూర్వకాలమునుండియు సమ్మేళనమునకై ప్రయత్నములు జరుగుచునే యుండెను. ఒకానొకప్పుడు కురుజాతి మఱియొకప్పుడు పాంచాలజాతి యింకొకప్పుడు కోసలజాతి మఱియొకప్పుడు మగధజాతి దేశములో నాయకత్వము వహించుటగాని, సార్వభౌమమై పరిపాలనచేయుటగాని జరుగుచుండెను. ప్రాచీనకులధర్మము, కులముయొక్క స్వాతంత్ర్యేచ్ఛ యీయేకత్వమునకు చాల అంతరాయము కల్గించుచుండెను. ఇందుచే ఏకత్వము చాలకాలము నిలిచెడిదికాదు. భరతఖండముననీయేకత్వప్రయత్నము, అసపత్నసామ్రాజ్యస్థాపన, పుణ్యకార్యముగను రాజుయొక్క కర్తవ్యములలో నొకటిగను తలపబడుచుండెడిది. ఈ యేకత్వప్రయత్న మెంత ప్రబలమైనదన చేదిరాజును, బలవంతుడును,దుష్టుడును నగు శిశుపాలుడుకూడ యుధిష్ఠిరునిసామ్రాజ్యస్థాపన పుణ్యకర్మగా తలచి సహాయపడుట కంగీకరించెను. ఇట్టి యేకత్వము, సామ్రాజ్యము లేక ధర్మరాజ్యసంస్థాపన శ్రీకృష్ణునిరాజకీయోద్దేశమై యుండెను. మగధరాజగు జరాసంధుడు ఇట్టి ప్రయత్న మొనరించెను, గాని అతనిశక్తి అధర్మము అత్యాచారములపై ప్రతిష్ఠింప

బడి యుండుటచే క్షణికమని తలచి శ్రీకృష్ణుడు భీమునిచే జరా సంధుని బరిమార్పించి అతనిప్రయత్నమును దుదముట్టించెను. ఇక శ్రీకృష్ణునికార్యమునకు ప్రధానాటంకము గర్వోపేత మును బలయుతమునునైన కురుజాతి. కురువంశము చాలకాలము నుండి భరతఖండములో నాయకత్వము వహించుచుండెను. ఇంగ్లీషులో చెప్పబడు (Hegemony) అనగా అనేకసమాన స్వాతంత్ర్యజాతులలో ప్రధానత్వమును, నాయకత్వమును కౌరవజాతిపరంపరాగతఅధికారమై యుండెను. ఈ కౌరవజాతి బలగర్వములు ఇంత ప్రబలముగా నున్నచో భరతఖండమున నేకత్వమును స్థాపించుట అసంభవమని శ్రీకృష్ణుడు తలచెను. కనుకనే ఆయన కౌరవజాతిని నాశనమొనర్ప కృతసంకల్పు డాయెను. కాని భారతదేశమున సామ్రాజ్యపాలనము, కౌరవ జాతిపరంపరాగత అధికార మను మాట ఆయన మఱున లేదు. ధర్మతః యేది యెవరికి ప్రాప్యమో, దానినుండి వారిని తప్పించుట, అధర్మమని తలచి కౌరవజాతిలో న్యాయముగా రాజును, ప్రధానుడునైనట్టి యుధిష్ఠిరుని భావిసామ్రాజ్యపదవి యందు నియుక్తుని గావింప శ్రీకృష్ణుడు నిశ్చయించుకొనెను. శ్రీకృష్ణుడు పరమధార్మికుడు. ఏలనన సమర్థుడైనప్పటికి తన జాతియందుండెడి ప్రేమచేత తనయాదవకులమును కురుజాతి స్థానమున నిలబెట్టుటకు ప్రయత్నించలేదు. పాండవులలో జ్యేష్ఠుడగు యుధిష్ఠిరుని తప్పించి, తనప్రియసఖుడును బావమరదియునగు అర్జునునికి ఆపదవి కట్టపెట్ట తలచలేదు. కేవలము వయస్సు, పరంపరాధికారము, చూచినయెడల

అరిష్టమున కవకాశము కలదు గాన గుణము సామర్థ్యములను గూడ చూడవలెను. యుధిష్ఠిరుడు అధార్మికుడుగాని, అశక్తుడుగాని అయియుండిన శ్రీకృష్ణుడాస్థానమున మఱియొకరిని నియమించెడివాడే. యుధిష్ఠిరుడు వంశపరంపరానుసారముగను ప్రాచీన నియమానుసారముగను న్యాయమైన అధికారి యైనట్లే గుణములచేతను యోగ్యాధికారియే. యుధిష్ఠిరునికంటె బలపరాక్రమ సంపన్నులైన అనేక రాజులు కలరు. కాని కేవలము బలము ప్రతిభ రాజ్యాధికారమునకు అర్హమైనవి కావు. రాజు ధర్మరక్షణ, ప్రజారంజన, దేశరక్షణ చేయవలెను. మొదటి రెండుగుణములు యుధిష్ఠిరునిలో విశేషముగా నుండెను. ఆయన ధర్మతనయుడు, దయాస్వభావుడు, న్యాయపరాయణుడు, యథార్థవాది, ప్రజారంజకుడు, పూర్వోక్త గుణశేషముల బూరించుటకు ఆయనసోదరద్వయమగు భీమార్జునలు చాలుదురు. పంచపాండవులతో సమానులగుపరాక్రమవంతులగువారు వారి సమకాలమున మఱియొకరు లేరు. కనుక జరాసంధవధానంతరము కంటకరహిత మగుటచే శ్రీకృష్ణుని ఉపదేశానుసారము యుధిష్ఠిరుడు ప్రాచీనాచారానుసారము రాజసూయయాగమొనర్చి సామ్రాజ్యాధిపతి యయ్యెను.

శ్రీకృష్ణుడు ధార్మికుడేగాక రాజనీతిజ్ఞుడుకూడ నయియుండెను. దేశధర్మము, ప్రణాళిక, సాంఘికనియమములు బురస్కరించుకొని ఆయన తన పరమోద్దేశమును సిద్ధింపజేయుట కవకాశ ముండగా, ఆధర్మమునకు హాని, ఆ ఆచారమునకు విరుద్ధము, ఆనియమమునకు భంగము, ఏల యొనర్ప

వలెను? కారణములేకయే, యిట్టిసాంఘిక, రాజకీయ విప్లవము లొనర్చుట దేశానర్థకరము. శ్రీకృష్ణుడీకారణమును నెరింగియే మొదట ప్రాచీనమార్గమును కాపాడుటకు యత్నించెను. కాని ప్రాచీనప్రణాళికలో ఒకలోపము కలదు. అదేదన, ఆప్రయత్నము ఫలించినను చిరకాలము నిల్వజాలక అచిరకాలములోనే అంతరించుచుండెను. సమరబలోపేతు లెవరైనను రాజసూయయాగమొనర్చి సామ్రాట్టు కావచ్చును. కాని అతనివంశజులు బలహీనులగుటతోడనే పదచ్యుతి కలుగుచుండెడిది. అతనితండ్రికి లోబడిన బలపరాక్రమజాతులు వానికుమారుని కేల లోబడియుందురు? వంశగతాధికారము గాదు, రాజసూయయజ్ఞమే. అనగా అసాధారణబలపరాక్రమములే ఆసామ్రాజ్యమునకు కారణము లన్నమాట. అధికబలపరాక్రమములు కలవారు రాజసూయయాగముచే స్వరాజ్యాధిపతులగుచుండెడివారు. కనుకనే సామ్రాజ్యము స్థిరముగా నుండుట కెట్టి యవకాశము లేక యుండెను. అల్పకాలమే ప్రధానత్వము (Hegemony) ఉండెడిది. ఈ పద్ధతిలో మరియొకదోష ముండెడిది. నూత్నసామ్రాట్టు ఆకస్మికముగా ప్రధానత్వము పొందుటచే, దేశమునందలి బలయుతులును, తేజస్వులును, అసహిష్ణులునగు క్షత్రియులహృదయములలో యీర్ష్యాగ్ని ప్రజ్వరిల్లి అతడేలప్రధానుడాయెను, మనమేలకాకూడదను భావము కలుగుటకవకాశముండెడిది. యుధిష్ఠిరుని వంశములోని వారుకూడనీయీర్ష్యచేతనేలతనికి వ్యతిలేకులైరి. దుర్యోధనాదులు అతనిని మాయోపాయముచేత పదచ్యు

తుని జేసి దేశమునుండి వెడలగొట్టిరి. ద్వేషసహితపద్ధతి వలనిదోషము స్వల్పకాలములోనే కన్పట్టెను.

శ్రీకృష్ణు డట్టి ధార్మికుడో అట్టిరాజకీయవేత్త. దోష సహితమైనదియు, అహితకరమైనదియు, కాలమునకు తగనిదియు నగు పద్ధతినిగాని, నియమమునుగాని మార్చుటకు వెనుకాడెడు వాడు కాడు. ఆయన తన కాలములో ప్రధానవిప్లవకారి. రాజగు భూరిశ్రవుడు శ్రీకృష్ణుని నిందించుసమయమున, అతని సమకాలికులైన అనేక పూర్వాచార పరాయణులయొక్క ఆక్రోశమును వెల్లడించుచు "శ్రీకృష్ణుడును, అతనిచేనడిపింపబడు చున్న యాదవకులమును ధర్మమునకు విరుద్ధముగా ఆచరించు టకుగాని ధర్మమునకు భంగము కలిగించుటకుగాని జంక రనియు, ఎవరు కృష్ణునిసలహాప్రకార మాచరింతురో వారు తప్పక వెంటనే పాపమున బడుదు"రనెను. ఏలనన ప్రాచీనా చారముల బట్టుకొని వ్రేలాడువారి దృష్టిలో నూత్నభావము లన్నియు దోషములే. శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునిపతన మెరిగి యుండెను. ఏలనన అతడు భగవంతుడు. అందుచే ద్వాపర యుగమున కుపకరించుపద్ధతి కలియుగమున నిల్వజాలదని తలంచి కలికాలమున కుపయోగమైన భేద, దండోపాయములు గల రాజనీతి నుపయోగించి గర్వముగల క్షత్రియజాతి, బలము నాశమొనర్చి భావిసామ్రాజ్యము నిష్కంటకముగా జేయ సంక ల్పించెను. శ్రీకృష్ణుడు కౌరవులకు పురాతనసమకక్షశత్రులగు పాంచాలజాతిని కౌరవనాశనమునకు ప్రేరేపించి, కౌరవజాతిపై ద్వేషముచేతను, యుధిష్ఠిరునిపై ప్రేమచేతను, ధర్మరాజ్యసంస్థా

పనకును, ఏకత్వమునకును, తదితరజాతుల నన్నిటిని నీపక్షము నకు రావించి యుద్ధప్రయత్నమును కావించెను. సంధియందు శ్రీకృష్ణునకు నమ్మకము లేదు. సంధి జరుగదనియు, జరిగినను నెక్కువకాలము నిలువజాలవనియు నెఱిగియు, ధర్మముకొరకును, రాజనీతికొరకును సంధిప్రయత్నముచేసెను. కురుక్షేత్రసంగ్రామము శ్రీకృష్ణునిరాజనీతియొక్క ఫలితమనుటకు సందేహ మిసుమంతయు లేదు. కౌరవాన్వయమును, క్షత్రియ జాతిని ధ్వంస మొనర్చి నిష్కంటక సామ్రాజ్యమును భారత దేశమున, నేకత్వస్థాపనయు శ్రీకృష్ణునుద్దేశములు. ధర్మ రాజ్యస్థాపనకొఱకు జరుగుయుద్ధము ధర్మయుద్ధము. ఆ ధర్మ యుద్ధమున ఈశ్వరనిర్దిష్టవిజయుడు, దివ్యశక్తిసంపన్నుఁడు మహారథికుడునైన అర్జునుడు. అట్టి అర్జునుడు అస్త్రసన్యాస మొనర్చినచో శ్రీకృష్ణునిరాజకీయపరిశ్రమ వ్యర్థమై, భారత దేశమున ఏకత్వము సిద్ధించెడిది కాదు. దేశముయొక్క భవి ష్యత్తునందు అచిరకాలములోనె ఘోరతర కుఫలితములు గలిగెడివి.

## భ్రాతృవధ - కులనాశనము.

అర్జునుడు చెప్పినకారణములన్నియు కులక్షేమముకొరకు చెప్పబడెనేగాని జాతిక్షేమమునుగూర్చి యొకటియు లేదు. అతడు కౌరవవంశహిత మొనర్పదలచి భారతదేశక్షేమమును మఱచి అధర్మమునకు దోసిలొగ్గి ధర్మమునకు జలాంజలి సమ ర్పింప నంసిద్ధుడాయెను. స్వార్థముకొఱకు భ్రాతృవధచేయుట

మహాపాప మను సంగతి యందఱెఱిగినదే. కాని భ్రాతృ ప్రేమావశుడై జాతికి అనర్థమొనర్చుటకు సాయపడుట, జాతి క్షేమమునకు విముఖుడగుట అంతకంటె మహాపాపము. అర్జునుడు అస్త్రసన్యాస మొనర్చిన అధర్మము జయమొందెడిది. అందుచే దుర్యోధనుడు దేశములో ప్రధానరాజును, సమస్తదేశమునకు నాయకుడును నయి దేశమును క్షత్రియజాతిని తన దుర్మార్గముచే కలుషితమొనర్చెడువాడు. భరతఖండముననున్న పరాక్రమకులము లన్నియు స్వార్థము, యీర్ష్య మొదలగువాని ప్రేరణములచే ఒండొరుల నాశనమొనర్చుకొని, దేశమున ఐకమత్యము, న్యాయపరిపాలన లేకపోవుటచే వెంటనే విదేశీయులు వచ్చి ఆర్యసభ్యతను ధ్వంసమొనర్చి ప్రపంచభావిహితావకాశమును బరిమార్చెడువారు. శ్రీకృష్ణార్జునులచే స్థాపితమైన సామ్రాజ్యము నాశనమైన 2000 వత్సరముల అనంతరము భారతదేశమున ఆరంభించిన రాజకీయోపద్రవము లప్పుడె ఆరంభమయ్యెడివి.

కొందరు అర్జును డెట్టిఅరిష్టములు కలుగునని యుద్ధమొనర్చుటకు భయపడెనో నిజముగా అవి కురుక్షేత్రసంగ్రామము జరుగుటచేతనె జరిగెనందురు. భ్రాతృవధ కులనాశనము జాతినాశనము కురుక్షేత్రసంగ్రామఫలితము. ఈసంగ్రామము కలిప్రారంభమునకు కారణము. ఈ యుద్ధమున ఘోరమైన భ్రాతృవధ జరిగినమాట సత్యము. కాని విచారించతగిన దేదన, శ్రీకృష్ణుని ఉద్దేశము యేయుపాయమున సాధింపబడవలెనని సంగతి. కనుక శ్రీకృష్ణుడు సంధి జరుగదని

యెరిగియు సంధికై విశేషప్రయత్నమొనర్చెను. అయిదూళ్లైనను నిచ్చిన ధర్మరాజు తృప్తిపొందుననని చెప్పెను. ఏలనన పాదము మోపుటకు స్థలము దొరకిన శ్రీకృష్ణుడు ధర్మరాజ్య సంస్థాపన చేయగలడు. కాని యుద్ధమొనర్పక వాడిగల సూదిమొన మోపు స్థలమైనను యియ్యనని దుర్యోధనుడు చెప్పెను. కనుక దేశముయొక్క భవిష్యత్తంతయు యుద్ధఫలితముపై ఆధారపడియున్నపుడు, ఆయుద్ధమున భ్రాతృవధ జరుగునని తలచి అట్టిమహాత్కార్య మొనర్పకుండుట అధర్మము. కుటుంబహితము జాతిహితము ప్రపంచహితములో లీనమొనర్పవలెను. సోదరప్రేమ, పరివారహితము అను మోహమున బడి కోట్లకొలదిప్రజలక్షేమమును, భావిసుఖమును నాశనమొనర్పకూడదు. అందుచే ఆవ్యక్తియు, కులమును నరకప్రాప్తియే పొందును.

కురుక్షేత్రసంగ్రామమున కులనాశనము జరిగినమాట సత్యమే. ఈ యుద్ధఫలితముగా ప్రతాపాన్వితకురువంశము పూర్తిగా నాశనమయ్యెను. అయినను కౌరవజాతినాశనము వలన భారతదేశము సురక్షితముగా నుండుటచే, నష్టముగాక లాభమే చేకూరెను. కుటుంబమును ప్రేమించుటలో నెటుల మోహమున్నదో అటులనే కులమును ప్రేమించుటలోను గలదు. స్వదేశీయుడు, దేశమున కెట్టి హాని యొనర్చినను, నెంత దుర్మార్గుడైనను అతడు సోదరుడనిగాని, పుత్త్రుడనిగాని సహించవలెననియు అతనితో విరోధము పెట్టుకొనగూడదనియు, అతని నేమియు అనకూడదనియు తలచుట వైష్ణవ

మాయాఫలితము. అందుచే అధర్మము ధర్మముగా తలచి అనేకులు భ్రమపడి కులమోహమున బడుదురు. కారణములేక గాని స్వార్థముకొరకుగాని సరియైన ప్రయోజనమును, ఆవశ్యకతయు లేకగాని దేశీయునితో కలహించుట అధర్మము. కాని దేశీయుడు మాతృదేశమున కపకారమొనర్చుటకు సిద్ధపడునపుడు వానిదుర్మార్గమును సహించి అటుల వాడు దేశారిష్టముచేసినను ప్రేమించుట మహాపాపము. మునల్మానులకు సహాయమొనర్చిన దేశీయులను, శివాజి వధింపబూనినపుడు ఆసమయమున నెవరైనను" "వారు దేశీయులు కనుక సహింపుము. వారిని చంపవద్దు. మహారాష్ట్రదేశమును మొగలాయులు రాజ్యమొనర్చిన చేయనిమ్ము. మహారాష్ట్రులు మహారాష్ట్రులను ప్రేమించవలె'' నని చెప్పిన నెంత హాస్యాస్పదముగా నుండును? అమెరికాలో బానిసత్వశాసననిర్మూలనవిషయమైజరిగిన అంతర్యుద్ధములచే అనేకవేల అమెరికనులు హతమైరి. అందుచే అది చెడుపనియేనా?

ఇట్టి సమయమున స్వదేశీయులతో విరోధము వహించుట, దేశజులను యుద్ధమునందు వధించుట జాతికిని, జగత్తుకును మేలుగావించుటకు ఏకమాత్రోపాయమై యున్నది. ఇందువలన కులనాశనము కలిగినను జాతిజగత్తులహితసాధనలు వీడి శాంతత వహించరాదు. కులరక్షణ జాతిహితముకొరకు ఆవశ్యకమైనచో సమస్య జటిలమె యగును. మహాభారతకాలమున జాతి ప్రతిష్ఠింపబడి యుండలేదు. అందరు కులమునే మానవజాతియొక్క కేంద్రస్థానముగ తలచియుండిరి. వారు

ధర్మము పాండవులపక్షమున గలదనియు, ఒకమహాసామ్రాజ్య స్థాపనచే భరతఖండమంతయు కేంద్రీకృతమగుట కవకాశము గలదనియు తలంచిరి. ఇంతియేగాక కులమే ధర్మమున కాధార మనియు, జాతికి కేంద్రమనియు, కులనాశనముచే ధర్మరక్షణ జాతిసంస్థాపన అసంభవమనియు, వారు తలచియుండిరి. అర్జునుడు కూడ ఆభ్రమనె పడెను. ఈయుగమున జాతియే ధర్మము నకు ఆధారమును, మానవసంఘముయొక్క కేంద్రస్థానమును. ఈ కాలములో జాతిరక్షణయే ముఖ్యధర్మము. జాతినాశనము క్షమింపరాని మహాపాతకము. మానవసంఘ మంతయు ఒకే జాతిగా భావింపబడు కాలము కూడ రాగలదు. అప్పుడు ప్రపంచములోని మహాజ్ఞానులు, కర్మయోగులు జాతిరక్షణకై యుద్ధమొనర్తురు. రెండవపక్షమున శ్రీకృష్ణుడు విప్లవకారియై నూత్నకురుక్షేత్రయుద్ధమును కల్పించి జగత్కల్యాణ మొన ర్చును.

## శ్రీ కృ ష్ణు ని రా జ నీ తి ఫ లి త ము.

అర్జునుడు ప్రథమమున కృపావేశమున కులనాశనము నకై నధికముగ చింతించెను. ఏలనన ఆ గొప్పసైన్యసమా వేశమును జూచినంతనే, కులము జాతి యనువానింగూర్చిన చింత వాని కవియే అతనిమనమున కలిగెను. నేడు మానవు లకు, జాతిహితచింత యెటుల సహజధర్మ మైనదో, నాడు కులహితబుద్ధియే భారతీయులకు స్వభావధర్మ మయ్యెను. కాని కులనాశనముచే జాతిప్రతిష్ఠ నాశనమగుననెడి సంకోచము

నిరాధారమా? అర్జునుడు తలచిన విధముననే సంభవించె ననియు, కురుక్షేత్రసంగ్రామము భారతదేశపుటధోగతికిని, చిరకాలదాస్యమునకును మూలకారణ మాయెననియు, పరాక్రమవంతులగు క్షత్రియులు హతులై క్షాత్రతేజము నశించుటచే, భారతదేశమునకు గొప్ప అమాంగళ్యము కలిగె ననియు అనేకు లందురు. ఎవరిచరణములందు అనేకహిందువు లిప్పుడు శిష్యభావమున తమ శిరముల నిడుచున్నారో అట్టి విఖ్యాతవిదేశాంగన క్షత్రియజాతినాశనముచే బ్రిటీషు సామ్రాజ్యస్థాపనమార్గమును సుగమ మొనర్చుటకే స్వయముగా భగవంతుడు శ్రీకృష్ణావతారము దాల్చెనని చెప్పుట కెంతమాత్రమును సందేహించకపోయెను. ఇట్టి అసందర్భపు సంగతులు చెప్పువారు విషయము నామూలాగ్రముగా ఆలోచించక తుచ్ఛరాజకీయతత్వమునకు వశులై శ్రీకృష్ణునిరాజనీతిలో దోషముల నారోపింతురు. ఇట్టి రాజకీయతత్వము, మ్లేచ్ఛవిద్య, అనార్యులఆలోచనావిధానము. అనార్యులు ఆసురికబలమే అధికమైనదిగను, ఆబలమే స్వాతంత్ర్యమునకును జాతీయాధిక్యతకును ఏకైకాధారముగను నెంచుదురు.

జాతీయమహత్వము కేవలము క్షాత్రతేజముపై నిలువజాలదు. చాతుర్వర్ణ్యములచతుర్విధ తేజమే యీమహత్వస్థాపన కాకరమైనది. సాత్త్వికమగు బ్రహ్మతేజము, రాజసికమగు క్షాత్రతేజమును, జ్ఞానము, వినయము, పరోపకారబుద్ధి, వీనియొక్క మధురసంజీవనిసుధయందు జీవింపజేయవలెను. క్షాత్రతేజము శాంతియుతమయిన బ్రహ్మతేజమును

కాపాడవలెను. క్షాత్రితేజోరహితమైన బ్రిహ్మతేజము, తమోభావమువలన ఆక్రిమింపబడి శూద్రిత్వముయొక్క సమస్తనికృష్టగుణముల కాశ్రియమిచ్చును. కాన క్షత్రియులులేని దేశమున బ్రాహ్మణనివాసము నిషేధింపబడెను. క్షత్రియవంశము లోపించినచో నూత్నక్షత్రియుల నేర్పాటు చేయుట బ్రాహ్మణునిప్రిథమకర్తవ్యము. బ్రహ్మతేజోరహితమైన క్షాత్రితేజము ఘోరమైన రాక్షసబలముగా మారి ప్రిథమమున పరహితము నాశనమొనర్పయత్నించి, తుదకు తానే నాశనమొందును. అసురగణము స్వీయబలాధిక్యతచే పతితులై సమూలముగా నశించునని ఒకానొక రోమను కవి యథార్థమైనసంగతినే చెప్పియుండెను. సత్త్వగుణము రజోగుణమును సృష్టించవలెను. రజోగుణము సత్త్వమును కాపాడి,సాత్త్వికకార్యములందు నియుక్తించవలెను.ఇటులజరిగిన వ్యక్తికిని, జాతికిని శ్రేయస్సు కలుగును. సత్త్వగుణము, రజోగుణమును కబళించిన, రజోగుణము సత్త్వగుణమును గ్రిసించిన తమఃప్రాదుర్భావముచే జయించిన గుణము స్వయముగ పరాజితమై, తమోగుణము రాజ్యమొనర్చును. బ్రాహ్మణు డెన్నడును రాజు కాజాలడు. క్షత్రియులు నశించిన శూద్రుడే రాజగును. అప్పుడు బ్రాహ్మణుడు తమోగుణోపేతుడై ధనాశచే జ్ఞానమును విక్రతమొనర్చి శూద్రునకు దాసుడై, ఆధ్యాత్మికభావనిశ్చేష్టతను పోషించి తాను మ్లానుడై ధార్మికావనతికి కారణుడగును. క్షత్రియరహితమై శూద్రునిచే పాలింపబడుజాతి తప్పక దాస్యమొన

ర్పును. భరతఖండమున కీగతియే కలిగినది. కానిచో ఆసుర బలపరిభావమున క్షణికోత్తేజనముచే, శక్తిసంచారము, మహత్త్వము కలుగుట వాస్తవమైనను, వెంటనే దుర్బలత్వము దుఃఖము బలహీనతయు కలిగి దేశము శక్తిహీనమగును. లేదా రాజసభోగము, దంభము, స్వార్థము వృద్ధినొందుటచే జాతి నిరుపయోగమై, మహత్వరక్షణమునం దసమర్థమగు చున్నది. కాదేని పరస్పరవిరోధముచేతను, దుర్మార్గము వల్లను, అత్యాచారములచేతను, దేశము చెడిపోయి శత్రువు లకు సులభమగును. హిందూదేశచరిత్రయందును పాశ్చాత్య దేశచరిత్రలందును నీపరిణామములతో కూడిన చాల ఉదా హరణములు కానవగును.

మహాభారతకాలమున ఆసురబలభారముచే జగత్తు కంపించిపోయెను. భారత దేశమున నిట్టి బలపరాక్రమములు గల క్షత్రియులు అంతకు పూర్వమునగాని అనంతరముగాని జన్మించలేదు. కాని అట్టి బలపరాక్రమములు సద్వ్యుపయోగ మగుననుకొనుట కెక్కడను అవకాశము లేకయుండెను. వా రందరు ఆసురబలాన్వితులై దంభాహంకారులును, స్వార్థపరు లును, స్వేచ్ఛాపరాయణులునై యుండిరి. శ్రీకృష్ణుడు ఈ అసురబలమును నాశనమొనర్చి ధర్మరాజ్యసంస్థాపన చేయక పోయినయెడల, పైన పేర్కొనబడిన త్రివిధపరిణామములలో నేదియో యొకటి నిశ్చయముగా జరిగెడిదే. భారతదేశము అకాలముననే మ్లేచ్ఛులస్వాధీనమయ్యెడిది. ౫౦౦౦ సంవత్స రములకు పూర్వము కురుక్షేత్రసంగ్రామము జరిగెననియు

౨౫౦౦ సంవత్సరములు గడచినపిమ్మట విదేశీయులప్రథమా క్రమణ సింధూనదిలవతలబడ్డువరకు జరిగెననియు జ్ఞాపక ముంచుకొనవలెను. కనుక అర్జునిచే ప్రతిష్ఠింపబడిన ధర్మ రాజ్యము అప్పటివరకు బ్రహ్మ తేజోనుప్రాణితక్షాత్రి తేజఃప్రభా వముచే దేశమును రక్షించెను. అప్పుడుకూడ సంచితక్షాత్రి తేజము దేశములో ఎంతవరకుండెనన దాని భగ్నాంశమే ౨౦౦౦ సంవత్సరములవరకు దేశమును కాపాడెను. చంద్ర గుప్తుడు, పుష్యమిత్రుడు, సముద్రగుప్తుడు, విక్రముడు, సంగ్రామ సింహుడు, ప్రతాపుడు, రాజసింహుడు, ప్రతాపాదిత్యుడు, శివాజీ మొదలగు మహాపురుషులు అక్షాత్ర తేజోబలము చేతనే దేశదౌర్భాగ్యముతో పోరాడిరి. గుజరాతుయుద్ధమున ఝాంసీ లక్ష్మీబాయియొక్క చితితో దానిశేషాగ్నికణము ఆరిపోయెను. నాటితో శ్రీకృష్ణుని రాజనీతియొక్క సుఫలపుణ్య ములు క్షీణించిపోయెను. భారత దేశమును, ప్రపంచమును రక్షిం చుటకుగాను పూర్ణావతారము మరల రావలసిన ఆవశ్యకత గలదు. ఆ అవతారము లుప్తమైనబ్రహ్మ తేజమును తిరిగి మేల్కొల్పును. ఆబ్రహ్మ తేజము క్షాత్ర తేజమును సృష్టించును. శ్రీకృష్ణుడు భారతదేశక్షాత్ర తేజమును కురుక్షేత్రమున నాశన మొనర్చకపోవుటయేగాక అసురబలమును హత మొనరించి బ్రహ్మ తేజమును క్షాత్రి తేజమును కాపాడెను. అసురబలాన్విత మైన క్షత్రియవంశసంహారముచే సుద్దామరజశ్శక్తిని నాశన మొనర్చినమాట సత్యమే. ఇట్టిమహావిప్లవము అంతర్విరోధము యొక్క ఉత్కటభోగముద్వారమున క్షయ మొనర్చుటచే

ఉద్దామక్షత్రియకులసంహార మెన్నడును అరిష్టకరమైనది కాదు. అంతర్విరోధము లేకపోయిన రోమను క్షత్రియులకు అకాలనాశనము ప్రాప్తించియుండెడిది. అంతర్విరోధముచే అది తప్పి తత్ఫలితముగ రాజ్యాంగము స్థాపించుటచే రోమను మహాసామ్రాజ్యమునకు శాంతి చేకూరెను. ఇంగ్లండులో అంత ర్విరోధమువలన క్షత్రియకులనాశనముచే నాల్గవ ఎడ్వర్డు, ఎనిమిదవ హెన్రీ, ఎలిజబెత్ రాణి ఆధునిక ఆంగ్లేయప్రబలరాజ్య నిర్మాణమునకు పునాదులు వేయగలిగియుండిరి. కురుక్షేత్ర సంగ్రామమున భారతదేశముకూడ నిట్టిరక్షణమే పొందెను.

కలియుగమున భరతఖండము హీనతనొందుచున్నదను మాట ఎవరును త్రోసివేయజాలరు. కాని అధోగతి తెచ్చు టకు భగవంతు డవతరించియుండలేదు. ధర్మరక్షణ, ప్రపంచ రక్షణ, ప్రజారక్షణలకొఱకు భగవాను డవతరించును. విశేష ముగ కలియుగమున పూర్ణభావమున భగవంతు డవతరించును. ఏలనన కలియుగమున మానవునిపతన మధికమై అధర్మాభి వృద్ధియే స్వాభావికమగును. కనుక మానవజాతిరక్షణకు, అధర్మనాశనము, ధర్మసంస్థాపనము సల్పుటకొఱకు కలియుగపు నడకను ఆటంకపరచుటకొఱకును, నీయుగమున విశేషముగ భగవంతు డవతారములు దాల్చును. శ్రీకృష్ణు డవతరించి నప్పుడు కలిరాజ్యారంభమయ్యెను. భగవానునిఆవిర్భావభీతిచే కలి తనరాజ్యమున కాలిడజాలకపోయెను. ఆయనప్రసాద ముచే పరీక్షిత్తు కలికి పంచగ్రామములు దానమొనర్చి దాని ఆధిక్యమును ఆపివేసెను. కలియుగారంభము మొదలు ఆఖరు

వరకు కలికిని, మానవునకును జరుగుచున్నట్టియు, జరుగునట్టియు సంగ్రామమున సహాయముచేయుటకు నాయకరూపమున పరమాత్మ అవతరించి బ్రహ్మతేజము, జ్ఞానము, భక్తి, నిష్కామకర్మ బోధించి రక్షించును. భరతఖండమును రక్షించుటయే మానవకళ్యాణమునకు పునాదియు, ఆశాస్థలమును. కురుక్షేత్రమున భగవంతుడు భరతఖండమును రక్షించెను. ఆ రక్తసముద్రమున నూతనజగత్తుయొక్క లీలాపద్మమునందు కాలరూపుడగు విరాటపురుషుడు విహారమొనర్ప నారంభించెను.



# ద్వితీయాధ్యాయము



సఞ్జయ ఉవాచ:—

తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః. ౧

సంజయుడు పలికెను:—

అట్లు కృపావశుడై కన్నుల నీరుగ్రమ్మియుండ విషాదము నొందుచున్న అర్జునుని జూచి మధుసూదను డిట్లు చెప్పుచున్నాడు.

శ్రీభగవానువాచ:—

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. ౨

శ్రీ కృష్ణుడు పలుకుచున్నాడు:—

అర్జునా! అకీర్తికరమును, నరకహేతువును, అనార్యులచే ఆచరింపబడ తగిన యీ మనోమాలిన్యము, యీ సంకట సమయమునం దెట్లు కలిగెను?

క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. ౩

పార్థా! భయపడకుము. ఇది నీకు తగనిది. నీచమైన యీమనోదౌర్బల్యమును విడనాడి, అరిమర్దనా! యుద్ధమునకు లెమ్ము.

## శ్రీ కృ ష్ణు ని జ వా బు.

అర్జునుడు కృపావశుడౌటచే దుఃఖమతనిని మ్రింగివేయు చున్నటుల శ్రీకృష్ణుడు కనిపెట్టెను. కాన యీ తామసిక భావమును తొలగించుటకుగాను అంతర్యామి, తన ప్రియ సఖునికి రాజసభావ ముదయించి తామసగుణము తొలగు నట్లు క్షత్రియోచితముగా మందలించెను. శ్రీకృష్ణు డిట్లనెను. "అర్జునా! ఇది స్వపక్షమునకు సంకటకాలము. ఇపుడు నీవు అస్త్రసన్యాసమొనర్చిన పూర్తిగా నాశనము సంభవించును. యుద్ధరంగమున స్వపక్షమును విడనాడుట నీబోటి క్షత్రియ శ్రేష్ఠునిమనమున కలుగతగిన భావము కాదు. ఎచటనుండి అకస్మాత్తుగా నీకీ దుర్బుద్ధి కలిగెను? నీ భావము దౌర్బల్య సూచకము, పాపభూయిష్ఠమైనది. అనార్యులచే ప్రశంసింప బడదగినది. నీవు దానికి వశుడవైతివి. కాని ఆర్యులకు తగి నదికాదు. దానిచే పరలోకమున స్వర్గప్రాప్తికి విఘ్నమును, ఇహలోకమున యశఃకీర్తులకు హానియు కలుగును." దీని తర్వాత యింకను మిక్కిలి మర్మభేదమైన మందలింపొన ర్చెను. "ఈ భావము పిరికివానికి తగినది. నీవు వీరశ్రేష్ఠుడవు. నీవు విజయుడవు. కుంతీపుత్రుడవు. నీవు యీ విధముగా పలుకతగునా? ఈ దౌర్బల్యమును విడనాడి, లేచి నీ కర్తవ్య మును నెరవేర్చుటకు సిద్ధుడవు కమ్ము."

# కృ ప — ద య.

కృప, దయ, యీ స్వభావములు రెండును వేఱువేఱు. ఇంతేగాక కృప, దయకు వ్యతిరేకమైన భావముకూడ. దయ మానవునియొక్కయు, జాతియొక్కయు, పరులయొక్కయు దుఃఖమును విమోచన మొనరించును. జగత్కల్యాణ మొనరించును. స్వీయదుఃఖమునుగాని పరులదుఃఖమునుగాని సహించజాలక, శ్రేయోమార్గమును గానకయుండుస్వభావము కృపాస్వభావము. దేశముయొక్కగాని, మానవజాతియొక్కగాని దుఃఖవిమోచనకై కలుగు భావము దయ యనబడును. రక్తపాతము కలుగునని భీతిచే పుణ్యకార్యములనుండి తొలగి జాతియొక్కయు, జగత్తుయొక్కయు చిరకాలదుఃఖనాశన మొనర్చితిననుకొనుట కృపావిశేషము. ఇతరులదుఃఖమునకు చింతించి, ఆదుఃఖవిమోచనకై కలుగు ప్రబలప్రవృత్తియే దయ యనబడును. ఇతరులదుఃఖమునందు కాతరత నొందుట కృప యనబడును. కాతరత దయకాదు, కృప. దయ బలవంతునిధర్మము. కృప బలహీనుని ధర్మము. దయాస్వభావముచే బుద్ధుడు భార్యాపుత్రులను, తల్లిదండ్రులను, బంధుమిత్రులను దుఃఖితుల గావించి, సర్వస్వము విడనాడి ప్రపంచకల్యాణమునకై బయలుదేరెను. తీవ్రదయా ఆవేశినియై కాళికాదేవి ప్రపంచమునగల అసురులను సంహరించి పృథివిని రక్తప్లావిత మొనర్చి, ప్రజలదుఃఖవిమోచన మొనర్చెను. అర్జునుడు కృపావశుడై అస్త్రత్యాగ మొనర్చెను. ఈభావము అనార్యులచే గౌరవింపబడతగినదియు, ఆచరింపతగినదియు నై

యున్నది. ఆర్యవిద్య ఉదారమైనది; వీరోచితమైనది. అనా
ర్యుడు మోహమున బడి నీచభావమునే ధర్మమని యెంచి,
ఉదారమైన ధర్మమును విడనాడును. అతడు రాజసిక భావము
కలవాడై, తనయొక్కయు, తన ప్రియజనులయొక్కయు,
స్వీయకులపరివారములయొక్కయు హితమును జూచునుగాని
ప్రపంచహితమును గాంచడు. కృపావశుడగుటచే ధర్మపరా
ఙ్ముఖుడై, తనను పుణ్యవంతునిగను, కఠోరవ్రతానుష్ఠానుడగు
ఆర్యుని నిర్దయునిగను. అధర్మపరాయణునిగను భావించి తన్ను
గురించి గర్వపడును. అనార్యుడు తామసిక మోహమున
ముగ్ధుడై అప్రవృత్తినే నివృత్తియని, సకామ, పుణ్యప్రేమలకే
ధర్మముయొక్క ఉన్నతాసన మిచ్చును. దయ ఆర్యభావము.
కృప అనార్యభావము.

మానవుడు దయాస్వభావమున వీరుడై ఇతరులదుఃఖ
కష్టములను తొలగించుటకొఱకు అమాంగళ్యముతో పోరాడు
టకు యత్నించును. స్త్రీ దయావశముచే యితరులదుఃఖమును
దూరీకృతి మొనర్చుటకు సేవాశుశ్రూష లొనర్చుటయందు తన
సమస్తశక్తి నుపయోగించును. ఎవడు కృపావశుడై అస్త్ర
త్యాగ మొనర్చి ధర్మవిముఖుడై, విలపించుచు కూర్చుండి,
కర్తవ్య మొనర్చుచుంటిననియు, పుణ్యవంతుడననియు తలచునో
వాడు పిరికివాడు. ఈ భావము క్షుద్రము, బలహీనమైనది.
విషాద మెన్నడును ధర్మము కాజాలదు. దుఃఖమున కాశ్రయ
మిచ్చువాడు పాపమున కాశ్రయమిచ్చును. ఈ చిత్తమాలిన్య
మును దుర్బలభావమును వీడి యుద్ధమునకు సంసిద్ధుడవై

కర్తవ్యపాలనచే జగత్తును, ధర్మమును రక్షించి, భూభారము హరించుటయే శ్రేయస్కరము. ఇదియే శ్రీకృష్ణునిమాటల మర్మము.

అర్జున ఉవాచ:—

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. ౪

అర్జునుడు చెప్పెను:—

ఓ కృష్ణా! నే నెటుల భీష్మద్రోణాదులతో యుద్ధమున తలపడి పూజనీయులగు గురుజనులపై నెటుల అస్త్రప్రయోగ మొనర్తును?

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మ పీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. ౫

మహానుభావులైన గురువులను వధించుటకంటె, యీ లోకమున బిచ్చ మెత్తుకొనుటయే శ్రేయస్కరము. గురుజనులను వధించి ధర్మమోక్షములకు తిలాంజలి యిచ్చి, కేవల మీలోకమున రుధిరప్రదిగ్ధములైన అర్థకామము లనుభవించుటే గద.

న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,

యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

మన జయాపజయములకు హేతువెద్దియో? ఈ రెంటిలో యేది కోరతగినదో నేను తెలియజాలకున్నాను. ఎవరిని వధించిన పిమ్మట మనము జీవించుట కిచ్ఛగించమో అట్టివారు మనయెదుట నిలబడియున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

దీనతాదోషముచేత నాక్షత్రియస్వభావము నశించెను. ధర్మాధర్మము లెవ్వియో నాకు తోచకున్నవి. కాన నిన్ను అడుగుచున్నాను. నాకు శ్రేయోమార్గ మేదో నిశ్చయించి చెప్పుము. నేను నీకు శిష్యుడను. నీ శరణు పొందితిని. నాకు తెలియచెప్పుము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్. ౮

ఈ భూమియందు నిష్కంటకమై, సర్వసంపదలతో గూడిన రాజ్య మబ్బినను, లేక దేవేంద్రత్వము పొందినను, నా యింద్రియముల నన్నిటిని శోషింపచేయుచున్న శోక నివృత్త్యుపాయము నాకు కానరాకున్నది.

## అర్జునుడు శ్రేయోమార్గము తెలుపవేడుట.

శ్రీకృష్ణుని వాక్యోద్దేశములచే అర్జునుడు తాను రాజకీయవిపత్తును తొలగించుటనుండి విముఖుడనైతినని గ్రహించెను. కాని తనమనోవీథిని కలిగిన చిక్కులను పరిష్కరించుకోజాలక శ్రీకృష్ణుని శరణాగతుడై యిటుల పలికెను. "నేను క్షత్రియుడనైనను కృపావశమున నీ మహాత్కార్యము నుండి విముఖుడనైతిని. ఇది క్లీబత్వసూచకమును, అకీర్తికరమును, ధర్మవిరుద్ధమని అంగీకరింతును. కాని గురుహత్యా మహాపాపమనియు, స్వీయసుఖముకొఱకు వారిని వధించుటచే అధర్మమువల్ల పతితుడనై, ధర్మమోక్షములను, పరలోకసుఖమును ఇంకను కోరతగినసమస్తమును పోగొట్టుకొందునని తలచుచున్నాను. కోరినది లభించును. రాజ్యము పొందనగును. కాని యిది యెంతకాలము అనుభవించుట ? అధర్మముచే పొందిన భోగము మరణపర్యంతమే నిలచును. కాని అనంతరము చెప్పజాలని దుర్గతి కలుగును. ఐనను ఒకవేళ భోగించుట అబ్బినను, యీభోగములో గురుజనరక్తస్వాదముపొంది, ఎట్టిసుఖశాంతులనుభవింతును ? ఇట్టి ప్రియజనులవధించి యీజన్మమున సుఖభోగము లనుభవించజాలననియు, జీవించజాలననియు తలచుచున్నాను. నీవు నాకు సమస్తపృథ్వీరాజ్య మిచ్చినను స్వర్గమును జయించి ఇంద్రపదవియిచ్చినను నా కిష్టములేదు. దుఃఖము నన్నావరించి నా కర్మేంద్రియజ్ఞానేంద్రియముల నన్నిటిని జయించి శిథిలమొనర్చి కార్యముల నొనర్చుటకు వీలుకలుగనీయకున్నది. ఇట్టిస్థితిలో నే నేమనుభవింతును? నేను విషమచిత్తుడ

నగుటచే దీనత్వమునొంది, నా క్షత్రియస్వభావమును పోగొట్టు కొంటిని. నేను నీశరణుజొచ్చితిని. నాకు జ్ఞానమును, శక్తిని, శ్రద్ధను కలుగజేసి శ్రేయోమార్గముజూపి నన్నురక్షించుము."

భగవంతునిసాన్నిధ్యమున సంపూర్ణ భావమున శరణు జొచ్చుటయే గీతలో చెప్పబడిన యోగమార్గము. దీనినే ఆత్మ సమర్పణము లేక ఆత్మనివేదన యందురు. ఎవడు భగవంతుని గురువు, ప్రభువు, సఖుడు, మార్గదర్శియని తలచి, పాపపుణ్యము లను కర్తవ్యాకర్తవ్యములను ధర్మాధర్మములను, లాభనష్టము లను విచారించక సర్వధర్మములను పరిత్యజించి, తన జ్ఞానకర్మ సాధనలయొక్క సమస్తభారమును శ్రీకృష్ణుని కర్పించునో వాడే గీతలోచెప్పబడిన యోగాధికారి. అర్జునుడు శ్రీకృష్ణునితో "నీవు గురుహత్య యొనర్పుమని చెప్పినను, అది ధర్మమనియు కర్తవ్యమనియు నాకు నచ్చచెప్పుము. నేను దానిని చేతు"ననెను. ఈగభీరశ్రద్ధాబలముచేతనే అర్జునుడు సమకాలికమహాపురుషు లందరిని అతిక్రమించి గీతోక్తవిద్యకు శ్రేష్ఠపాత్రుడుగా గ్రహింపబడెను.

దీనికి సమాధానముగా శ్రీకృష్ణుడు ప్రథమమున అర్జు నుని అభ్యంతరముల రెంటిని ఖండించి, అనంతరము గురు భారము వహించి, సరియైనజ్ఞానబోధ నారంభించెను. ౩౭ వ శ్లోకమువరకు అర్జునునిచే తెలపబడిన అభ్యంతరములను ఖం డించి అనంతరము గీత బోధింపసాగెను. ఈఖండనలో కూడ కొన్ని అమూల్యసదుపదేశరత్నములు కలవు. వీనిని గ్రహించక

పోయిన గీత హృదయంగమము కాజాలదు. ఈ విషయము విపులముగా ఆలోచించు టవసరము.

సఞ్జయ ఉవాచ:—

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. ౯

శతృవులను తపింపజేయు అర్జునుడు శ్రీకృష్ణునితో అటుల చెప్పి నేను యుద్ధముచేయనని ఊరకుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయోర్మధ్యే విషీదంత మిదం వచః. ౧౦

రెండు సేనలమధ్య దుఃఖించుచున్న అర్జునుని జూచి శ్రీకృష్ణుడు నవ్వుచు నీ వాక్యమును బలికెను.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧

ఎవరికొరకు శోకించరాదో, నీవు వారికొరకు దుఃఖించుచు జ్ఞానివలె వేదాంతచర్చ చేయుచున్నావు. కాని జ్ఞాని చచ్చిన వారలను గూర్చిగాని బ్రదికియున్న వారలను గూర్చిగాని దుఃఖించడు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్. ౧౨

నేనును, నీవును, ఈ రాజులును, నిదివర కెప్పుడును లేక పోలేదు. ఇకముందును లేకపోవువారము కాము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. ౧౩

ఈ జీవునకు ఈ దేహమునందు బాల్యము, యౌవనము, ముసలితనము నెట్లో, మరియొక దేహమును పొందుటయు నట్లే. కాబట్టి యావిషయమునందు పండితుడు మోహము నొందడు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినో నిత్యాస్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

ఓ అర్జునా ! ఇంద్రియములకు విషయసంయోగముచే శీతోష్ణసుఖదుఃఖములు కలుగుచున్నవి. ఆ సంయోగము లన్నియు అనిత్యములు. వచ్చుచు పోవుచుండును. నీవు వానిని ఓర్చుకొనుము.

యంహి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. ౧౫

ఏస్థిరబుద్ధికల పురుషుడు యీ సుఖదుఃఖముల నన్నిటిని అనుభవించియు, దుఃఖమునొందక, ఆ సుఖదుఃఖములను సమ భావమున గ్రహించునో వాడే మోక్షమున కర్హుడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్త్వదర్శిభిః. ౧౬

అసత్తైన (లేని) యీ దేహమునకు సత్త (ఉండుట) లేదు. సత్తైన యాత్మ లేకపోవుట లేదు. తత్త్వవిదులు యీ రెంటియొక్క నిశ్చయమును దెలిసియుందురు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి. ౧౭

ఏదేనిచే నీసమస్తప్రపంచము వ్యాపింపబడినదో అట్టి ఆత్మ నాశనములేనిది. దానిని ఎవరును నాశనము చేయజాలరు.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. ౧౮

ఆత్మ నాశనము లేనిది, నిత్యమైనది. అది ధరించిన యీ దేహముమాత్రము నాశనముగలదని చెప్పబడినది. కాన ఓ అర్జునా! యుద్ధమొనర్చుము.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి నహన్యతే. ౧౯

ఎవ డీయాత్మను వధించువానిగను, దేహనాశనానంతరము ఆత్మ నాశనమగునట్లుగను దెలియుచున్నాడో వారిద్దరును తెలియనివారలే. ఈ ఆత్మ చంపదు, చంపబడదు.

నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయం భూత్వా భవితావా న భూయః,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే. ౨౦

ఈ ఆత్మకు జన్మగాని, మృత్యువుగాని లేదు. ఒకప్పుడుండి మఱియొకప్పు డుండనిదికాదు. ఇది జన్మరహితమైనది. నిత్యమైనది. పురాతన మైనది. దేహము నశించగా నశించనిది.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్. ౨౧

ఎవ డీయాత్మను నిత్యమైనదిగను, నాశనము లేనిదిగను, జన్మలేనిదిగను, అవ్యయమైనదిగను, ఎఱుగుచున్నాడో అట్టి వాడు ఎవరిని వధించును? ఎవరిచే వధింపబడును?

వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨

మానవు డేవిధమున చినిగిన వస్త్రములను వదలి నూతనవస్త్రములను ధరించునో, ఆవిధముననే జీవి జీర్ణ దేహమును వీడి నూతన దేహము నాశ్రయించును.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః. ౨౩

ఈ యాత్మను ఆయుధములు నఱుకజాలవు. అగ్ని దహింప జాలదు. నీళ్లు తడుపజాలవు. వాయువు ఎండింప జాలదు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచ,
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪

ఈ ఆత్మ ఛేదించుటకును, దహించుటకును, తడుపుటకును, ఎండించుటకును అలవిగానిది. నాశనములేనిది. స్థిరరూపమైనది. చలింపనిది. అనాదియైనది.

అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. ౨౫

ఈఆత్మ వ్యక్తముగానిది, అచింత్యమైనది, వికారరహిత మైనది. నీవు ఈవిధముగా తెలిసికొని శోకమును వీడుము.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే హతమ్,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. ౨౬

అట్లుగాక ఈ ఆత్మకు జనన మరణములు కలవని తలచి నను, నీవు దీనిని గురించి దుఃఖించగూడదు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

ఎందువల్ల ననగా బుట్టినవానికి మరణము తప్పదు. చచ్చినవానికి జన్మము తప్పదు. కాబట్టి అనివార్యమయిన యీ విషయమునందు నీవు దుఃఖించుటచే నుపయోగము లేదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా. ౨౮

ఈ భూతములు మొదట తెలియరానివి. మధ్య తెలియ బడుచున్నవి. తెలియబడని అంతముకలవి. ఈ స్వాభావిక క్రమమును గుఱించి శోకించుట కెట్టి కారణమును గానిపించ కున్నది.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః.

ఆశ్చర్యవ చ్ఛైవ మన్య శ్శృణోతి,
శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్. ౨౯

ఒకానొక డీయాత్మను ఆశ్చర్యవస్తువవలె జూచును. మరియొకడు దీనినిగూర్చి ఆశ్చర్యమువలెనే చెప్పును. మరి యొకడు ఆశ్చర్యముగా వినును. వినియు ఈ ఆత్మను నెవ్వడును నెఱుంగడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. 30

ఈ ఆత్మ యెల్లపుడును యెల్లశరీరములమధ్యనుఅవధ్యమై యుండును. కనుక యీ సమస్తజీవులనుగురించి నీవెన్నడును శోకించు టుచితముకాదు.

---

## మృత్యువు అసత్యము.

అర్జునునిమాటలు వినిన పిమ్మట శ్రీకృష్ణునకు నవ్వు వచ్చెను. ఈ నవ్వు కల్పితమైనను, పరిసన్నతాపూర్ణమైనది. అర్జునునిభ్రిమలో మానవజాతియొక్క పురాతనభ్రిమను గ్రిహించి అంతర్యామి నవ్వెను. ఆభ్రిమ శ్రీకృష్ణునిమాయా ప్రసూనము. ప్రపంచములోని, అశుభ, దుఃఖ, దౌర్బల్యము లను, అనుభవ సంయమములద్వారమున నాశనమొనర్చుట కొఱకు ఆయన మానవుని మాయావశీభూతుని గావించును. ప్రాణమునందు ప్రీతి, మరణమునందు భయము, సుఖదుఃఖము లకు లోబడుట, ప్రియాప్రియములను గ్రిహించుట మొదలగు

అజ్ఞానము అర్జునునిమాటలలో బడయనగును. అజ్ఞానమును మానవునిబుద్ధినుండి పారదోలి, జగత్తును అశుభము నుండి కాపాడుటకును, శుభ కార్యమునకు, అనుకూలస్థితి నేర్పరుచుటకును శ్రీకృష్ణు డవతరించి గీతను బోధించెను. కాని మొట్ట మొదట అర్జునునికి కలిగిన భ్రమను భోగింప జేసి క్షయ మొనర్చవలెను. అర్జునుడు శ్రీకృష్ణునిసఖుడు, మానవజాతియొక్క ప్రతినిధి. అతనికే గీత చెప్పబడవలె. అతడే అర్హుడు. కాని మానవసంఘము నేటివరకు కూడ గీతయొక్క అర్థమును గ్రహించుటకు యోగ్యతను పొందజాలకున్నది. అర్జునుడును సంపూర్ణముగా గీతను గ్రహించియుండలేదు. క్రైస్తవమతము ప్రేమను, బౌద్ధమతము దయను, మహమ్మదీయమతము శక్తిని కలిగించి, ఆదుఃఖభోగమును తగ్గించుచున్నను, అర్జునుని మనో మధ్యమున గలిగిన శోకదుఃఖములును మానవజాతి నేటికిని అనుభవించుచునే యున్నది. ఇపుడు కలియుగాంతర్గత సత్యయుగముయొక్క ప్రథమ భాగ మారంభము కానున్నది. భగవానుడు తిరిగి భరతఖండమునకు, గీతాప్రదాన మొనర్చుచున్నాడు. గ్రహించుటకు ధారణయొనర్చుటకు శక్తిగలిగిన, భారత దేశమునకును, ప్రపంచమునకును శుభము కలుగుట సునిశ్చయము.

శ్రీకృష్ణుడు అర్జునునితో "నీవు పండితునివలె పాపపుణ్యములను గూర్చియు, జననమరణములను గూర్చియు పలుకుచు, జాతియొక్క లాభనష్టము లెటుల సంభవించునో చెప్పబూనియున్నావు. కాని నీకు సరియగు జ్ఞాన మిసుమంతయు

లేకపోవుటయే గాక నీప్రతిశబ్దము అజ్ఞానావృతమై యున్న"ద నెను. "నీవేల స్పష్టముగా నాహృదయము దౌర్బల్యము చెందె ననియు, శోకముచే కాతరత చెందితివనియు, బుద్ధి కర్తవ్య పరాఙ్ముఖమైనదనియు చెప్పక, జ్ఞానియొక్క మాటల నుపయో గించి, నీ దౌర్బల్యమును సమర్థించుకొనజూచిన ప్రయోజనము లేదు. దుఃఖము పామరహృదయముననే కలుగును. వాడే మర ణమును ఎడబాటును అతిభయంకరముగను, జీవించుటే మహాభాగ్యముగను, దుఃఖమునసహించజాలనట్టిదిగను కర్తవ్యము కఠోరముగను, స్వార్థమే పరమార్థముగను తలచి, సుఖము కలిగిన సంతసించి దుఃఖము కలిగిన విచారపడును. ఇదంతయు అజ్ఞానము. ఎవరికొఱకు దుఃఖించకూడదో వారికొఱకు నీవు దుఃఖించుచున్నావు. జ్ఞాని బ్రతికియున్నవారిని గుఱించిగాని మృతినొందినవారిని గూర్చిగాని దుఃఖించడు. అత డీవిధముగ తలచును: మరణము, విచ్ఛేదము, దుఃఖము లేవు. నేను అమ రుడను. చిరకాలమునుండి ఏకాకిగనే యుండుచున్నాడను. ఆనందునిసంతానమును, అమృతునిపుత్రుడను, జననమరణ ములతో సుఖదుఃఖములతో ఈ పృథ్వియందు దాగుడుమూత లాడుచున్నాను. ప్రకృతియొక్క విశాలనాటకరంగమున నేను అభినయమొనర్చుచుంటిని. శత్రుమిత్రరూపమున యుద్ధము, శాంతి, ప్రేమ, కలహ రసాస్వాదన మొనర్చుచుంటిని. ఈస్వల్ప కాల మిచటనుండి రేపోమాపో దేహత్యాగమొనర్చి ఎచట కేగు దునో ఎఱుగను. ఇది నా అనంతక్రీడారంగమున ఒకక్షణము మాత్రమే. నేనుంటిని, ఉన్నాను, ఉండుదును. నేనుసనాతనుడను,

నిత్యుడను, నాశములేనివాడను, ప్రకృతికి నేను ప్రభువును, జననమరణములకు కర్తను, భగవంతునిఅంశమును, భూతభవిష్య ద్వర్తమానముల కధికారిని. ఏవిధమున దేహమునకు బాల్యము యౌవనము వృద్ధాప్యము కలుగునో దేహాంతర ప్రాప్తియు నట్టిదియె"-- మరణము నామమాత్రము. దానిపేరు వినిన భయదుఃఖములు పొందుదుము. కాని సరిగా వస్తుస్వరూపము నెఱిగిన భయదుఃఖము లుండవు. మనము నిజముగా బాలుడు యౌవనప్రాప్తి నొందుట చూచి మరణించెనని తలచి నాప్రియ బాలు డెటుల పోయెను ? ఈ యువకుడు ఆబాలుడు కా డనియు నాచిన్నిముద్దులబిడ్డ డెక్కడకో పోయెనని, విలపించిన వానిని జూచి నవ్వి వాని అజ్ఞానమునకు వగతుము. ఏలనన ఈపరిణామము ప్రకృతినియమము. బాలకుని దేహమున యువకుని దేహమున ఒకేపురుషుడు బాహ్యపరివర్తనాతీతుడై స్థిరభావమున గలడు. సామాన్యమానవుడు మరణమునకు భయదుఃఖముల పొందుటను గాంచి జ్ఞాని నవ్వుచు అజ్ఞానమే యిందుకు కారణముగా గ్రహించును. ఏలనన దేహాంతర ప్రాప్తియు ప్రకృతియొక్క నియమమే. స్థూలదేహమునను సూక్ష్మదేహమునను ఒకేపురుషుడు బాహ్యపరివర్తన కతీతుడై స్థిరభావమున గలడు. మనము అమృతుని బిడ్డలము. చంపునదెవరు? చచ్చునదెవరు? మృత్యువు మనల స్పృశింప జాలదు. మృత్యు వనెడిది వట్టిమాట. మృత్యువు కేవలము భ్రమ. మృత్యువు లేదు.

## మాత్రిలు.

పురుషుడు అచలుడు. ప్రకృతి చలనమైనది. చలన సహితమైనప్రకృతిమధ్యను పురుషు డున్నాడు. ప్రకృతియం దున్న పురుషుడు, పంచేంద్రియముల ద్వారమున చూచిన దానిని, వినినదానిని, ఆఘ్రాణించినదానిని, ఆస్వాదించిన దానిని, స్పృశించినదానిని అనుభవించుటకు ప్రకృతి నాశ్రయించును. మనము రూపమును జూతుము, శబ్దమును విందుము, గంధము నాఘ్రాణింతుము. రసము నాస్వాదింతుము, స్పర్శము ననుభవింతుము. శబ్దస్పర్శరూపరసగంధము లైదు. ఈ పంచతన్మాత్రలు ఇంద్రియభోగవిషయములు. ఆరవయింద్రియమగు మనస్సుయొక్క విశేషము విషయసంస్కారము. బుద్ధియొక్క విషయము ఆలోచించుట. పంచతన్మాత్రలు, సంస్కారము, చింతానుభవనమును, భోగించుటయే, పురుషప్రకృతుల పరస్పరసంభోగక్రీడలు. శుద్ధాశుద్ధములని యీభోగము రెండువిధము లైనది. శుద్ధభోగమున సుఖ దుఃఖములు లేవు. పురుషుని కెల్లప్పుడు స్వభావసిద్ధమైన ఆనంద ముండును. అశుద్ధభోగమున సుఖదుఃఖములు, శీతోష్ణములు, క్షుత్పిపాసలు హర్షశోకాది ద్వంద్వములు అశుద్ధభోగిని చకితునిగా చేయును. కోరికయే అశుద్ధతకు కారణము. కామియే అశుద్ధుడు. నిష్కామియే శుద్ధుడు. కోర్కెయే రాగద్వేషములను సృజించును. రాగద్వేషములకు వశుడై పురుషుడు విషయాసక్తుడగును. ఆసక్తియొక్క ఫలమే బంధన. పురుషుడు విచలితుడు, విక్షుబ్ధుడు. అతడెట్టి కష్టదుఃఖము లనుభవించు

చున్నను ఆసక్తియొక్క అభ్యాసదోషముచే వానిక్షోభ వ్యథా కారణముల పరిత్యాగ మొనర్చుటకు అశక్తుడై యుండును.

## స మ భా వ ము .

శ్రీకృష్ణుడు ప్రథమమున ఆత్మయొక్క నిత్యత్వమును గూర్చి చెప్పి అనంతరము అజ్ఞాననిర్మూలోపాయమును బోధించెను. మాత్రి లనగా విషయములయొక్క నానారూప మైన స్పర్శసుఖాది ద్వంద్వములకారణములు. ఈ స్పర్శము లన్నియు అనిత్యములు. వాని కాద్యంతము లుండుటచే వానిని అనిత్యములని ఎఱిగి వానియం దాసక్తిని విడనాడవలెను. అనిత్యములం దాసక్తి కలిగిన వానిరాకచే ఆనందము, నిర్గమ నముచే దుఃఖము కలుగును. ఈ స్థితినే అజ్ఞానమందురు. అజ్ఞాన ముచే నాశనరహితమైన ఆత్మయొక్క సనాతనభావము అవ్యయానందములు మరుగుపడి క్షణికమైన భావమునందును, వస్తువునందును, మత్తతనొంది వానినాశనాంతమున శోక సాగరమున బడును. ఇవ్విధమున పరాజితము నొందక ఎవరు విషయస్పర్శముల నన్నిటిని సహించగలరో అనగా ద్వంద్వము లనుభవించియు సుఖదుఃఖములలోను శీతోష్ణములలోను ప్రియాప్రియములలోను, మంగళామంగళములలోను, సిద్ధ్యా సిద్ధులలోను, హర్ష శోకము లనుభవించక సమభావమున ప్రఫుల్లచిత్తముతోను చిరునగవుతోను గ్రహించగలరో, వారే రాగద్వేషములనుండి విముక్తులై, అజ్ఞానపాశమును

దెగించి సనాతన భావమును ఆనందమును పొందుట కర్తా లగుదురు. "అమృతత్వాయ కల్పతే."

## సమత్వము యొక్క గుణము.

ఈసమత్వమే గీతయొక్క ప్రథమబోధ. సమత్వమేగీతా జ్ఞానము పొందుటకు ఆధారము. గ్రీకు దేశపు స్టోయికసాంప్రదాయము భారతదేశమునుండి ఈ విద్యను గ్రహించి, ఐరోపా ఖండమున సమత్వవాదప్రచారము గావించెను. గ్రీకు వేదాంతియగు "ఎపిక్యూరియస్" శ్రీకృష్ణునిచే ప్రచారము చేయబడిన యీ విద్యయొక్క, ఒకభాగమును మాత్రమే గ్రహించి భోగవాదమును ( Epicureanism ) ప్రచారమొనర్చెను. సమత్వవాదము, భోగవాదము, యీ రెండును ప్రాచీన పాశ్చాత్యదేశముయొక్క నైతికశ్రేష్ఠమతములు. ఇవి నేడు ఆధునికపు ఐరోపా దేశమున నూతనాకారము దాల్చి Puritanism and Paganism లగా మారెను. కాని గీతా సాధనలో సమతావాదము, శాంతి లేక శుద్ధభోగవాదము ఒకటె. సమత్వము కారణము; శుద్ధభోగము కార్యము. సమత్వమునం దాసక్తినశించి రాగద్వేషము లుడుగును. కోర్కె నశించుటచేతను, రాగద్వేషములు లేకపోవుటచేతను, శుద్ధత కలుగును. శుద్ధపురుషునిభోగేచ్ఛ ఆసక్తిరహిత మగుటచే శుద్ధము. సమత్వముతో కలసి ఆసక్తి రాగద్వేషము లొకే సమయమున నుండజాలనట్టి సమత్వగుణ మిందే కలదు. సమత్వమే శుద్ధికి మూలబీజము.

## దుః ఖ ము ను జ యి ం చు ట.

గ్రీకుస్తోయిక సాంప్రదాయములో ఒకలోపము కలదు. వారు దుఃఖమును జయించుటకు సరియగు ఉపాయమును గ్రహించజాలకపోయిరి. వారు దుఃఖమును నిగ్రహించి అణచి పెట్టి పరదళితమొనర్చి దుఃఖమును జయించుటకు ప్రయత్నించిరి. కాని గీతలో నిటుల చెప్పబడెను. "ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి" "భూతములన్నియు ప్రకృతిని అనుభవించుచున్నవి. నిగ్రహ మేమి చేయగలదు?" దుఃఖనిగ్రహముచే మానవహృదయము శుష్కమై, కఠోరమై ప్రేమశూన్యమై పోవును. దుఃఖమువల్ల కంటినీరు కారకపోవచ్చును. బాధానుభవము నెమ్మదిగా సహించవచ్చును. భార్యాపుత్రబంధుమిత్రసంఘదుఃఖములను చలించని చిత్తముతో భరించవచ్చును. ఈ భావము బలదృప్తమగు అసురతపస్సు. దానికిని ఆధిక్యతయు, మానవాభివృద్ధిసాధనలో ప్రయోజనమును గలదు. కాని ఇది దుఃఖమును జయించుటకు సరియగు ఉపాయము మాత్రము కాదు. దుఃఖమును జయించుటకు సరియయినమార్గము జ్ఞానము, శాంతి, సమత్వము. శాంతభావమున సుఖదుఃఖములను స్వీకరించుటయే సరియైనమార్గము. ప్రాణమునందు సుఖదుఃఖసంచారమును వారించక బుద్ధి చలింపనీయకయుంచును. సమత్వమునకు స్థానము బుద్ధికాని, ప్రాణ చిత్తములు కావు. బుద్ధి సమముగా నున్న చిత్తప్రాణములు తమంతతామే సమముగా నుండును. ఐనను ప్రేమ మొదలగు ప్రకృతిజనితప్రవృత్తు లుడిగిపోవు. మాన

వుడు పాషాణహృదయుడు కాడు. "ప్రకృతిం యాంతిభూతాని" ప్రేమ మొదలగు ప్రవృత్తులు ప్రకృతియొక్క చిరకాల ప్రవృత్తులు. దానినుండి విడివడుటకు పరబ్రహ్మమునందు లీనమగుట ఒకటియే యుపాయము. ప్రకృతిలోనుండి ప్రకృతిని వర్జించుట అసంభవము. కోమలత్వము వీడిన, కఠినత్వము హృదయమును ఆక్రమించును. బాహ్యరూపమున దుఃఖమును నివారించిన అంతరంగమున స్తంభించియుండి అలక్షితభావమున ప్రాణమును శుష్కింపజేయును. ఇట్టి కృచ్ఛ్రసాధన ఉన్నతినొందుటకు అవకాశములేదు. తపస్సుచే శక్తి కలుగు ననుట సత్యమే. కాని యీ జన్మమున దేని నరికట్టజూతుమో అది రెండవజన్మమున ఆటంకముల నన్నిటిని త్రోసివేసి ద్విగుణీకృతవేగమున బయలుదేరును.

సంపూర్ణము.



## గీ త ల ను బ ఠిం చు వి ధ ము.

ప్రిపంచమున అనేక ధర్మగ్రింథములు కలవు. పలు విధములైన దార్శనికవాదములును బ్రివర్తిల్లుచున్నవి. కొందరు స్వమతాభిమానులు తమధర్మగ్రింథములందే భగవంతునిపరమోపదేశములు కలవనియు, తదితరము లన్నియు భ్రాంతియుతములైన అసత్యము లనియు దలచెదరు. విజ్ఞులైన దార్శనికులు సహితము తత్వసంబంధమైన తమవాదమే చరమసిద్ధాంతమని నమ్మ్మటయు గలదు.

అయినను, ఇకాలమున నీ యభిప్రాయములు కొంత వరకు సడలినవి. అస్త్రశస్త్ర సాహాయ్యమున ధర్మప్రిచారమొనర్చుకాలము గతించినది. సత్యమనునది ఎచ్చటనో ఒక్కచోటను మాత్రమే బంధింపబడి యున్నదను విషయ మిప్పుడు విశ్వాసార్హము కాదు. సమస్తమతములయందు సర్వధర్మగ్రింథములందు సత్యము నిహితమై యున్నదని తెలిసికొనగలుగుచున్నాము.

కాని ఇతరమతగ్రింథములందు గొంత సత్యమున్నను, తమమతమునందే పూర్ణసత్యము అఖండముగ వెలుగుచున్నదనియు, ముక్తికి అది యొక్కటే సాధనమనియు నమ్మువారిప్పటికిని గొందరు కలరు. మన మాదరించు ధర్మగ్రింథమును, మన మవలంబించు దార్శనికమతమును ఇతరులపై బలవంతముగ బ్రయోగింపజూచెదము. ఇతరులకుగూడ మనకువలెనే ధర్మవిషయమున అణుమాత్రిమైనను స్వాతంత్ర్యము గలదను విషయమును అంగీకరింపము.

కావున, వేదములు, ఉపనిషత్తులు, గీతలు మొదలగు ప్రాచీనధర్మగ్రంథములను గూర్చి యోజించునప్పుడు, వాని దృక్పథ మేవిధముగ నుండును. జీవనసమస్యాపరిష్కారము నకు వాని యుపయోగము నెంతవర కుపలబ్ధి నొందగలిగితిమి, అను విషయమును ప్రప్రథమమున నిర్వచించుట యవసరము.

## సత్యము.

సత్యము ఏకము, సనాతనము అనుట నిస్సంశయము. హిందువుల సత్యమునకును, ముసల్మానుల సత్యమునకును, క్రైస్తవులసత్యమునకును భేదముండజనదు. యుగాంతర ముల క్రిందట నేది సత్యమో, అదియే నేటికిని సత్యమై యల రుచుండును. అయినను దేశకాలపాత్రములభేదము నను సరించి సనాతన సత్యము భిన్నరూపములుధరించుచుండును. అద్వితీయమగు చిరంతనసత్యమునుండియే అనేకఖండసత్యము లుద్భూతములై ప్రకాశింపుచున్నవి.

కావున నవియన్నియు నేదియో యొక విశేషగ్రంథము వలనగాని, ఒక్క అవతారచరిత్రను బట్టిగాని, సంపూర్ణముగ వ్యక్తములగుట యసంభవము. యథార్థమైన జ్ఞానమంతయు భగవద్గీతయందు పూర్ణముగ వివరింపబడినదని నేను నుడువను. అందలివిషయములు సమస్తదేశములకు సకలకాలములకు సంబంధించిన సత్యములే యనికూడ జెప్పజాలను.

ఏదియో యొక దేశమునకు, ఒకకాలమునకు సంబం ధించినవిషయములు భగవద్గీతయందు కొలదిగ నున్నవి. అయి

నను వానిని సర్వదేశ, సర్వకాలములకు సంబంధించినవిగ నన్వయించుకొనినగాని, వానివలన మనకు బ్రయోజన ముండదు. అట్టి అన్వయమువలన అణుమాత్రమైనను అర్థహాని కలుగదు. ఒకటి రెండుదృష్టాంతములను జూపెదను.

## య జ్ఞ ము.

భగవద్గీతలోని తృతీయాధ్యాయమున యజ్ఞములస్వరూప వర్ణనము గలదు. మానవుడు హోమములమూలమున దేవతలను సంతృప్తిపరచినయెడల, వారు సంతుష్టులై వర్షాదులను గలిగించి లోకమును పోషించెదరని యున్నది. ప్రాచీనభరత వర్షమున యజ్ఞసంబంధమై ఇట్టి విశ్వాస ముండెడిది. కాని ఆ విశ్వాస మిప్పు డంతరించినది. ఘృతాహుతులవలన దేవతలు తుష్టులై వర్షమును గురిపించుచున్నారను విషయము నీవిజ్ఞానయుగమున నవీనులకు హాస్యాస్పదమని వేరుగ నుడువ నక్కరలేదు.

కాని గీతలందు యజ్ఞముల నాధారముగ జేసికొని చెప్పబడిన సత్యము విశ్వజనీనమని ఎరుంగవలయును. పరస్పరాదానప్రదానము లొక్క మానవసంఘమునందే కాన్పించుట లేదు. ఈ యాదానప్రదానము విశ్వప్రకృతియం దంతటను వ్యాపించియున్నదని వైజ్ఞానికులు సహిత మంగీకరించెదరు. విశ్వమునం దంతటను ఏయాదానప్రదానము పరివ్యాప్తమై యున్నదో అదియే యజ్ఞముల మూలమున సూచింపబడినట్లు

గ్రహించుటవలన, భగవద్గీతాప్రతిపాదితమైన సత్యమున కెట్టి హానియు కలుగదు.

తల్లియొక్క ఆత్మదానమువలననే సంతానము సృష్టి యగుచున్నది. వృక్షలతాదులు పృథివినుండి వాయుజలాదులను గైకొనియే జంతుసంతానమునకు ఆహార మొసగుచున్నవి. జంతువులు మరణించి స్థావరములను ఫలప్రదముగ నొనర్చుచున్నవి. సూర్యాదినక్షత్రములు గ్రహములకు వెలుతురును వేడిమిని బ్రసాదించుచున్నవి. గ్రహములు పరస్పరాకర్షణమువలన సౌరమండలమును నిలుపుచున్నవి. సముద్రమునుండి మేఘములు, మేఘములమూలమున సముద్రములు ఉత్పన్నము లగుచున్నవి. ఇదియే ప్రకృతియందు ప్రవర్తిల్లుచున్న జగచ్చక్రము.

యజ్ఞము లీసత్యమునే వ్యక్తపరచుచున్నవి. లోకకల్యాణముకొరకు ఏమియు దానముచేయని ఇంద్రియపరాయణునిజీవితము వ్యర్థమని గీతలు బోధించుచున్నవి. కేవలము తనకొరకే మాత్రము పచనముచేసికొనినను, పాపమునే భుజించుచున్నాడని గీతాశ్లోకము స్పష్టపరచుచున్నది.

## శాస్త్రము.

భగవద్గీత పదునారవయధ్యాయమున "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" ఇది చేయతగినది, ఇది చేయరానిది అనునిర్ణయవిషయమున శాస్త్రమే ప్రమాణమని నుడువుచున్నది. ఇచ్చట శాస్త్రములన, ఆకాలమున

భరతవర్షమునందు వ్యాపించియుండిన శ్రుతిస్మృతులే యని తలంచినయెడల భగవద్గీతను మిక్కిలి సంకుచితపరచినవార మగుదుము. మానవుని మనమునం దప్పుడప్పుడు కోరిక లుద్రేకించుచుండును. కాని కేవలమిచ్ఛానుసారము వర్తించు మానవునకును పశువునకును భేద మేమాత్రి ముండదు. అందు వలన మానవుడు మీమాంసాద్వారమున కర్తవ్యాకర్తవ్యము లను వివేచించి, కొన్ని విధినిషేధములను నిర్ణయించుకొని యున్నాడు. దేశకాలభేదముల ననుసరించి ఈ విధినిషేధము లలో గొంతమార్పు కలిగినను, వానిని బూర్తిగ వదలక, పశుప్రవృత్తిని క్రమక్రమముగ నిగ్రహించుటకు బ్రయత్నిం పుచున్నాడు. అందువలన తనప్రవర్తనకు ప్రమాణభూత మైన విధినిషేధములనే శాస్త్రములని గీత నుడువుచున్నది.

కేవలము ప్రాచీనకాలమున హిందూసంఘమునకు బ్రమాణములైనవానినే శాస్త్రములని అర్థముచేసికొనుట వలన ప్రయోజనములేదు. మానవులు కేవలము స్వేచ్ఛా చారులుకాక, వారివారిసంప్రదాయానుగుణ్యాముగ విధి నిషేధములకు లోబడి, జీవితమును నడుపుకొనుచుండవలయు నని దీనియర్థము. ఇంద్రియచరితార్థతకు నేవియో కొన్ని నిర్దిష్టములైన విధినిషేధములను, కార్యాకార్యములను మాన దండముగ నేర్పరచి ప్రవర్తింపజేసిన యెడల, సద్గతి లభ్య మగుననుటయే గీత చేయుచున్నబోధ.

## చా తు ర్వ ర్ణ్య వి భా గ ము.

భగవద్గీతయందు చాతుర్వర్ణ్యవిభాగము కానవగును. కాని ఆ విభాగ మిప్పుడు జగత్తునం దెచ్చటను గన్పట్టదు. చాతుర్వర్ణ్యవిభాగము ఆధ్యాత్మికసత్యముయొక్క బాహ్యరూపమే యని కొంచెము పరిశీలించిన బోధపడును. కాని అది యొకకాలమున నొక యాకృతిని దాల్చియుండెను. ఇప్పుడవస్థాపరివర్తనము ననుసరించి, మరియొక యాకారమును దాల్చియున్నది.

సత్వరజస్తమస్సు లనెడి గుణత్రియము ననుసరించి మానవులు భిన్నప్రకృతులను గలిగియున్నారు. ఆయావ్యక్తియొక్క, ఆ యా జాతియొక్క ప్రకృతి ననుసరించి కర్మయు, కర్మధారయు నేర్పడియున్నవి. దీనిమూలముననే ప్రకృతిగతమైన వైశిష్ట్యము ప్రకాశమాన మగుచున్నది. ఇందే వ్యక్తియొక్కయు, జాతియొక్కయు సార్థకత కలదని గ్రహింపవలయును.

ఈ విశిష్టలక్షణముల ననుసరించియే ప్రాచీనులు వర్ణవిభాగ మొనర్చిరి. ఇప్పుడు కర్మకలాపము వృద్ధియగుటవలన ప్రకృతిగతమైన వైచిత్ర్యము (diversity) మరింత ప్రకాశించుచున్నది. అందువలన, పూర్వకాలపు చాతుర్వర్ణ్యవిభాగమున కిప్పు డట్టిసార్థకతయు లేదు. కావున ప్రతివ్యక్తికిని ప్రతిజాతికిని ప్రకృతిగతమైన విశిష్టత గలదనియు, "స్వభావనియత" మైన కర్మద్వారమున ఆవైశిష్ట్యమును వికసింప

జేసికొనినయెడల, పరమార్థము సిద్ధించుననుసత్యమే గీతయందు ప్రచార మొనర్పబడినది. అయ్యది సమస్తదేశములకు, సర్వ యుగములకు నుపయోగకారియైన సత్యము.

## స మ న్వ య ము.

ప్రాచీనుల మానసికావస్థకును, నవీనుల మానసికా వస్థకును విశేషభేదముగలదు. ఆ కాలమున సత్య మీవిధ ముగ బ్రచారమై యుండెననిగాని, పూర్వులు దాని నీరీతిని గ్రహించియుండిరని కాని, మనము సరిగ దెలిసికొనుట కష్టము. అందువలన, భగవద్గీతవంటి పురాతనధర్మగ్రంథముల వ్యాఖ్యానములయందు మతభేదము లుండుట యొక వింతగాదు. భగవద్గీత కిదివరకు ఎన్నియో టీకలు, భాష్యములు రచింప బడియున్నవి. నేటికిని ఇంకను రచింపబడుచున్నవి. ఈ కార ణముచే భగవద్గీతయందుగల దార్శనికసమస్యాసమూహము నకు సరియగు అన్వయమును గ్రహించుట అసంభవమగు చున్నది.

మన మేల గీతను బఠింపవలయును? దార్శనిక శాస్త్ర ముల శిక్షణముకొరకా? కాదు. మానవునిబుద్ధినైశిత్యము తీక్ష్ణమైనకొలదియు జగత్తత్వసంబంధమున నెన్నియో ప్రశ్నలు బయలు దేరుచుండును. వాని కన్నిటికిని భగవద్గీతయందు సరి యగు ప్రత్యుత్తరములు లేవు. కాని వాస్తవజీవితమునందు కర్మక్షేత్రమున ఆధ్యాత్మికోన్నతికి సహాయభూతమగు మార్గ మునుజూపు సత్యములు భగవద్గీతయం దెన్నియో కలవు.

మానవునిస్వీయశక్తి ననుసరించి సత్యమును గ్రహించుట కవకాశమును అందు మిక్కుటముగ గలదు. బుద్ధి గ్రహింపజాలని సత్యము యోగలభ్యమైన దివ్యదృష్టికి గోచరమగునని కూడ అందు బోధపడును.

## దేశకాలోచితభాష.

యోగలబ్ధమగు సార్వజనీనసత్యమును లోకమునకు వెల్లడింపవలయు ననిన, దేశకాలోపయోగమగు భాషను పరిభాషారీతులను అవలంబించక తప్పదు; ప్రచలితదార్శనిక భాషను సమకాలికమతవాదములసాహాయ్యమును స్వీకరించవలసియుండును. భగద్గీతయందు పేర్కొనబడిన దార్శనికమతవాదముల నావిధముగనే మనము గైకొనవలయును. గీతయందు యోగసాంఖ్యదర్శనములు పేర్కొనబడి యున్నవి. వానినిబట్టి పురాతనములైన దర్శనములను గూర్చి విచారించి లాభములేదు. వేదాంతసత్యమును నిరూపించుటకు ఆ దర్శనములసారమును భగవద్గీత స్వీకరించి, ఆ ద్వివిధమార్గముల నభివర్ణించియున్నది. అందు జ్ఞానపథము సాంఖ్యము; కర్మపథము యోగము.

టీకాకారులు భగవద్గీత నేదియో యొక విశేషదార్శనిక మతవాదమునకు ప్రమాణగ్రంథముగ జేయుటకు జాల శ్రమపడి యుండిరి. స్వమతమును సమర్థించు కొనుట కెందరో గీత నాశ్రయించిరి. ఈపలువిధములైన భాష్యములను

బట్టియే, భగవద్గీత యేయొక దార్శనికమతమును బలపర చుటలేదని స్పష్టపడుచున్నది.

ఆకాలమున బ్రచలితము లగుచుండిన సమస్తమత వాదములయొక్క ఉదారమును, గభీరమును అగుసమన్వయము భగవద్గీతయందు కానవగును. భగవద్గీతయందు సమన్వయమైన చిరంతన సత్యము సాధారణమగు యుక్తితర్కములచే నిర్ధారణ యగునదికాదు. భగవద్గీత ప్రదర్శించిన పథమున అగ్రేసరులగు సాధకులు మాత్రమే అందలి సత్యము ననుభూతము చేసికొని, సమస్తసంశయములకు దూరులై ముందుకు నడువగలరు.

భగవద్గీతయొక్క భాషావైఖరి, చింతాప్రణాలిక భావప్రకాశరీతి మొదలగు ప్రకటనాపద్ధతులను గమనించిన ఎడల,భగవద్గీతాతత్వముప్రత్యేకదార్శనికమతవాదముయొక్క సరిహద్దులలోను బంధింపబడినది కాదని మనకు గోచరించును.

## మ త త్ర య ము.

అద్వితీయపరబ్రహ్మమునుండియే యీజగత్తు ఉత్పత్తి యైనదని భగద్గీత అంగీకరించినది. అంతమాత్రముచే, దాని మతము అద్వైతమత మనుటకు వీలులేదు. గీత త్రిగుణమయి యగు మాయనుగూర్చి చెప్పుచున్నది. కాని మాయావాదము నామోదించిన ట్లెంచతగదు. అద్వయపరబ్రహ్మముయొక్క పరాప్రకృతియైనజీవుడు, తిరిగి బ్రహ్మమునం దైక్యమగుననువిష యమునుగట్టిగ నొక్కక, బ్రహ్మమునందు వాసముచేయునని చెప్పుటచే, భగవద్గీతమతము విశిష్టాద్వైత మనరాదు. పురుష

ప్రకృతిసంయోగముచే సంసార మేర్పడుచున్నదను విషయము నంగీకరించుచుండినను, అది సాంఖ్యము కాదు. శ్రీకృష్ణుడు పూర్ణభగవానుడనియు, పురుషోత్తము డనియు, బ్రహ్మము కంటె భిన్నుడు కాడనియు జెప్పుచున్నను, అది వైష్ణవధర్మ గ్రంథముగాదు. దార్శనికమతవాదయుద్ధమునందు భగవద్గీత ఒకపక్షమున అస్త్రరూపమున వ్యవహరించుటకు భగవద్గీత లిఖింపబడలేదు. భగవద్గీతయందు సకలమతములు, సమస్త వాదములు సమన్వయములై యున్నవి.

## విరాట్సమన్వయము.

భారతీయచింతాస్రోతమునం దిట్టి సమన్వయ మప్పుడప్పుడు జరుగుచునే యుండెను. ప్రాచీనఋషిపుంగవులు ఆధ్యాత్మికసాధనసంపత్తివలన, జగదంతరాళమున దేవలోకమును గనుగొనగలిగిరి. ఆ మహాసత్యము తత్కాలోచితమగు భాష భావములలో వేదములందు నానారీతుల వర్ణింపబడియున్నది. ఆ సముదాయమున కంతకును ఉపనిషత్తులు గభీరసామంజస్యమును జూపుటకు బూనుకొనెను. తదనంతరము అపారరత్నాకరతుల్యమగుఉపనిషత్సాగరమును మథించి తత్త్వవిచారరూపమున పరమార్థప్రాప్తికి సాధనభూతములైన భక్తి జ్ఞాన కర్మ శక్తులకు భగవద్గీత సమన్వయ మొనర్చెను. పిమ్మట తంత్రములు ఆధ్యాత్మికజీవనమునందలి ప్రత్యాహాములను గైకొని, పూర్ణతరజీవనసిద్ధికి సాధనభూతములైన మార్గములను జూపియున్నవి. సమగ్రజీవనమునందు భగవానుని లీలామృతమును గ్రోలుచు, సంపూర్ణదేవత్వమును బొంద

వచ్చుచును విషయమును దెల్పినవి. ఋషులే సత్యమును వేదములం దెరిగించియుండిరో, ఏసత్యము క్రమక్రమముగ ఉపనిషత్తులందు, భగవద్గీతయందు, తంత్రములందు విరళతరముగ విరళతమముగ స్ఫుటము చేయబడెనో, ఆసత్యము యొక్క పరిభావ మింకను భావికాలమున విస్తరించగలదు.

మానవుడు ప్రాచీనధర్మగ్రంథములలో బంధింపబడి యుండుట కంగీకరింపడు. మానవు డింకను సత్యోపలబ్ధికొరకు అగ్రేసరు డగుచున్నట్లు సూచనలు గోచరించుచున్నవి. అనేక నూతనస్రవంతులు మనయందు ప్రవహింప నారంభించినవి. ధర్మముయొక్క మహత్తరపరిభావము నిరంతరము మనలను జాగరిత మొనర్చుచున్నవి. వర్తమానకాలమున గవేషణము వలన బయల్పడుచున్న శక్తిపూర్ణములైనఆవిష్కరణముల యెడల మన మిక నిర్లక్ష్యమునుంచుటకు వలనుపడదు. అత్యంత పురాతనకాలమందలి గుప్తరహస్యములు నూతనకాంతులతో మన సమ్ముఖమున బ్రకాశించు చున్నవి. పూర్వకాలమున జరిగిన సమన్వయమును బునాదిగ గైకొని, భగవద్గీతా సాహాయ్యమున మనము గూడ భవిష్యద్విరాట్సమన్వయముకొరకు బ్రయత్నింపవలసి యున్నది. భగవద్గీతయందు నిహితమై యున్న సార్వజనీనమైన, చిరంతనమైన, సత్యసారసాహాయ్యమున ఆధ్యాత్మికజీవనమున నిర్మించుకొనుచు పూర్ణదేవత్వసిద్ధికి అగ్రేసరులమగుటకు భగవద్గీతను పఠింతుముగాక !



